# డాక్టర్ అండ్ అంకుల్



అనుసరణ :

ఎస్. కె. వెంకటాచార్యులు, ఎం. ఏ.,

ప్రకాశకులు :

మారుతిరావమా అండ్ కో., విజయవాడ.

విద్యావిషయక ప్రచారకులు.

# 2

ఎలీజాను ఆమె యజమానురాలు షెల్బీసతి చిన్నప్పటి నుంచి దయతో పెంచింది. ఎలీజా పెరిగి పెద్దదైంది. తరువాత వేఱొక యజమాని హారిస్‌వద్ద బానిసగానున్న జార్జిని వివాహం చేసుకుంది. జార్జి చాలా మంచివాడు. తెలివైనవాడు. కాని అతడి యజమానుడు క్రూరుడు. "బానిసలు మనుష్యులుకారు, వస్తువులు మాత్రమే. వాటిని యజమానులు ఇష్టమొచ్చినట్లు చెయ్యొచ్చు. అమెరికా చట్టాలు ఇందుకు అంగీకరిస్తాయి"అనే మనస్తత్వం కలవాడు. హారిస్, జార్జిని ఒకఫాక్టరీలో పనికి నియమించాడు. అప్పుడే జార్జి ఎలీజాను పెండ్లిచేసుకున్నాడు. అక్కడ జార్జి తన తెలివితేట లుపయోగించి ఒక క్రొత్త యంత్రాన్నిగూడా కనిపెట్టాడు.

తన బానిస, తనకంటె తెలివిగలవాడని ప్రసిద్ధిచెందటం హారిస్‌కు ఇష్టం లేకపోయింది. అంచేత జార్జిని, ఫాక్టరీపని నుండి మాన్పించాడు. తనవద్దనే ఉంచుకొని కఠినమైన పనులు చెబుతూ అతి క్రూరంగా హింసించటం మొదలుపెట్టాడు.

ఒకనాడు షెల్బీ దంపతులు ఇంట్లో లేని సమయంలో జార్జి, ఎలీజాను కలుసుకున్నాడు. అప్పుడు తన యజమాని హారిస్ తన్నుపెట్టుతున్న కష్టాలనన్నింటినీ వెళ్ళబుచ్చుకున్నాడు.

జార్జి యిలా అన్నాడు, " ఒకనాడు నేను బండిలో సామాను వేస్తున్నాను. అప్పుడు యజమాని కుమారుడు కొరడాతో గుఱ్ఱందగ్గర ఆడుకోటం మొదలుపెట్టాడు. వద్దని నేనన్నాను. అప్పుడతడు నన్నుకొట్టి, తిట్టి లోపలికివెళ్ళి, తన్ను నేను

కొట్టి తిట్టానని తండ్రితో చెప్పుకున్నాడు. అప్పుడు యజ
నన్నొక చెట్టుకు కట్టేసి, కొడుకు చేతికి కొరడాయిచ్చి. నన్ను
కొట్టమన్నాడు. ఆ కుఱ్ఱాడు నన్ను తనకు అలసటవచ్చేదాకా
కొట్టాడు. ఈవిషయం నాకు ఇంకా గుండెల్లో మెదుల్తూంది.

నేను నిన్ను పెళ్ళిచేసికోటం యజమానికి ఇష్టంలేదు. అతడు మన వివాహాన్ని గుర్తించడట. నేను మినా అనేమఱో అమ్మాయిని పెళ్లాడి ఆమెతో కాపురం చెయ్యాలట. లేక పోతే నన్ను ఇంకా కఠిన నరకంలోకి తీసికొని వెళ్ళేవారికి అమ్మేస్తాడట.

ఇక నేను ఈ దుర్భర జీవితాన్ని సహించలేను. నేను కెనడాకు తప్పించుకొని పారిపోతాను. అక్కడ బానిసత్వం ఉండదు. నన్ను తిరిగి యజమానికి పట్టియ్యరుగూడాను. అక్కడ నేను కష్టపడి పనిచేసి నా ఖర్చులుపోగా, డబ్బు మిగులుస్తాను. ఆ డబ్బుతో నిన్ను, మనముద్దులకుమారుడు హారీని కొనేస్తాను. మీ యజమాని షెల్బీ చాలా మంచివాడుగదా! మిమ్మల్ని అమ్మివేయటానికి ఆయనకేమీ అభ్యంతరం ఉండదనుకొంటాను''

“మీరు కెనడాకు వెళ్ళటం బాగానే ఉంది. కాని, త్రోవలో పట్టుబడితే ఏమవుతుందో గ్రహించారా?'' అంది ఎలీజా.

“పట్టుబడితే యింకేముంది? అంతా సర్వనాశనమే. ఇప్పుడున్నదానికంటె ఘోరాతిఘోరమైన నరకంలోకి త్రోయబడతాను. అయితే నేను నా ధృడనిశ్చయాన్ని చెబుతాను

నేను ఏమాత్రం బానిసగా పని చెయ్యను. పట్టుబడ్డానా, నాకింక మరణమే శరణ్యం. స్వేచ్ఛ లేక చావు – ఈ రెంటిలో ఏదో ఒకటి తప్పదు. వేరుమాట లేదు. నీ భర్త క్షేమంగా కెనడా చేరేటట్లు సహాయం చెయ్యమని దేవుణ్ణి ప్రార్థించు" అన్నాడు జార్జి.

"మీరు ఎట్టి ఆపదా రాకుండా సురక్షితంగా కెనడా చేరాలని కోరటంకంటె యింక చేసేదేముంది? దైవము మిమ్మల్ని తప్పకుండా రక్షిస్తాడు. మీరుగూడా కరుణామయుడైన దేవుణ్ణి ప్రార్థించండి." అంది ఎలీజా.

" గుడ్ బై " అనుకున్నారు ఇద్దరూ. కాని తిరిగి కెనడాలో కలసి సుఖంగా జీవించగలమనే ఆశ ఇద్దరికీ ఉంది!

# 3

షెల్బీ యింటికి సమీపంలోనే అంకుల్ టామ్ ఇల్లు ఉంది. ఇంటిచుట్టూ పూలమొక్కలు, తీగలు, ఫలవృక్షాలతో చూడటానికి చాలా సొంపుగా ఉంటుంది.

అంకుల్ టామ్ భార్య ఆంట్ క్లో. ఓనాడు సాయంత్రం ఆమె భోజనం తయారుచేస్తూ ఉంది. చక్కని రొట్టెనొకదానిని కాలుస్తోంది. వంట చెయ్యటంలో తనకు సమానమైనవారు ఆ ప్రాంతాల్లో ఎవరూ లేరని ఆమె దిలాసా.

ఇద్దరు పిల్లకాయలు, అప్పుడే నడవటానికి ప్రయత్నం చేస్తున్న ఒక చిన్నపిల్లతో ఆడుకుంటున్నారు. అంకుల్ టామ్

టేబుల్ వద్ద ఒక కుర్చీలో కూర్చొని పలకమీద పేడ్తు న్నాడు. అంకుల్ టామ్ చాలా బలశాలి, తెలివైనవా డు దయార్ద్రహృదయుడు. అన్ని సుగుణాలు అతనిలో మూర్తీభ వించి వున్నాయి. అతడు మాస్టరుజార్జి (షెల్బీ కుమారుడు) వద్ద చదువు నేర్చుకుంటున్నాడు.

మాస్టరు జార్జి, రొట్టెతయారయిందా అని ఆంట్ క్లోను అడిగాడు. త్వరలోనే రొట్టెగూడా తయారయింది. మాస్టరు జార్జి, అంకుల్ టాం, ఇంకా పిల్లలు, ఆంట్ క్లో మున్నగువారం దరూ భోజనాలు ముగించారు. చిన్నపిల్లకొంచెంసేపు అంకుల్ టామ్‌తో ఆటలాడుకుంది. తరువాత పిల్లలందరూ నిద్రపో యారు.

కొంచెం సేపట్లోనే అనేకమంది బానిసలు ఆ యింట్లో సమావేశమయ్యారు. అది మతసంబంధమైన సభ. అందరూ ప్రార్థనా గీతాలు పాడారు. కష్టాలన్నీ నశించి స్వర్గలోకం లోకి తొంగి చూచినట్లుంది వారిస్థితి. మాస్టరుజార్జి బైబిలు చదివివినిపించాడు. అంకుల్ టామ్‌గూడా ఉద్వేగంతో ప్రార్థనా గీతం ఆలాపించాడు. అందరూ దేవుని దరిదాపుకు వెళ్లి నట్లయింది.

ఇక్కడ సమావేశం యిలా జరుగుతుండగా షెల్బీ ఇంట్లో షెల్బీ, హేలీ సమావేశమయ్యారు. అంకుల్ టామ్‌ను, హేరీని, హేలీకి అమ్మకపత్రాలమీద షెల్బీ సంతకంపెట్టాడు. ఆపని అతి త్వరితంగా ముగిసింది. ఆ విధంగా అమటటం షెల్బీకి ఇష్టంలేదన్న విషయాన్ని హేలీ గ్రహించాడు. సాధ్య

# అంకుల్ టామ్స్ కేబిన్

## 1

షెల్బీ అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోని కెంటుకి నివాసి. వర్తకం చేస్తూఉండేవాడు. తింటానికి, ఒకరికి పెట్టటానికి తగిన తాహతు ఉండేది. చాలా దయాపరుడు. అంచేత తనదగ్గఱ పనిచేసే బానిసల్ని, మానవులుగా చూస్తుండేవాడు. అతనిభార్యగూడ భర్తకు తగిన ఇల్లాలై అన్నివిధాలా సహాయపడేది.

కాని కాలం ఒక్కరీతిగా గడవదు. షెల్బీ డబ్బుచిక్కులకు లోనై హేలీ అనే మఱో వర్తకునికి బాకీపడ్డాడు. అది ఎట్లా తీర్చాలో షెల్బీకి బోధపడలేదు. ఓనాడు తన బాకీ అడగటానికి హేలీ, షెల్బీయింటికి వచ్చాడు. తనడబ్బు ఏ విధంగానైనా సరే వెంటనే చెల్లించవలసిందని నిర్బంధించాడు. షెల్బీ తన బానిసల్ని కొందఱ్ని అమ్మివేస్తేకాని బాకీతీరదు. అట్లా చేయటం షెల్బీకి ఏ మాత్రం ఇష్టంలేదు. కాని గత్యంతరంలేదు. అతనివద్ద బానిసలలోకల్లా టామ్ చాలాసమరుడు; నమ్మకస్థుడు. బాకీ మొత్తంక్రింద టామ్‌ను హేలీకిఇచ్చివేయటానికి షెల్బీ సిద్ధపడ్డాడు. కాని యింకో చిన్న అమ్మాయినిగాని, అబ్బాయినిగాని యిస్తేగాని బాకీ పూర్తి పరిష్కారం కాదని హేలీ అన్నాడు.

వారిద్దఱూ మాట్లాడుకుంటూండగా హేరీఅనే స
లేక ఐదేళ్ళ కుఱ్ఱాడు ఆ గదిలోకి వెళ్ళాడు. కుఱ్ఱాడు చాలా చెలాకీగా ఉన్నాడు. హేలీకి ఆ కుఱ్ఱాడు నచ్చాడు. అంచేత తన బాకీక్రింద టామ్‌తోబాటు ఆకుఱ్ఱవాణ్ణిగూడా యిచ్చేయవలసిందని కోరాడు హేలీ. అంతట్లోకి ఆకుఱ్ఱాడితల్లి (బానిస ఎలీజా ఆ గదిలోకి వచ్చి, హేరీని తీసుకుపోయింది. ఆ కుఱ్ఱవాడ్ని తల్లినుండి వేరుచేసి అమ్మేయటం షెల్బీకి సుతరాం యిష్టంలేదు. ఏదోఒకటి తేల్చి చెప్పవలసిందని, హేలీ షెల్బీని నిర్బంధించాడు. సాయంత్రం మళ్ళీవస్తే ఏవిషయమూ తేల్చి చెప్పేస్తానన్నాడు షెల్బీ.

ఎలీజా తలుపు చాటుననుంచుని వారిసంభాషణ అంతా వింది. ఆమె చాలా భయభ్రాంతురాలైంది. వెంటనే తన యజమానురాలైన షెల్బీసతి దగ్గరకు వెళ్ళింది. తన కుఱ్ఱాడ్ని ఎవరికో అమ్మివేయబోతున్నారని తన భయాన్ని వెలిబుచ్చింది. షెల్బీసతిగూడా చాలాదయగలది. ఆమెకు తనభర్తహృదయం బాగా తెలుసు. కాని షెల్బీ ఎటువంటి డబ్బు చిక్కుల్లో వున్నాడో ఆమెకు ఇంకా తెలియలేదు. అంచేత షెల్బీసతి, ఎలీజాకొచ్చిన భయమేమీ లేదని హామీ నిచ్చింది. "మీ యజమాని అటువంటివాడుకాదు. నీ కొడుకుని నీనుంచి వేఱు చేసి అమ్మివేయటానికి నేనేమాత్రము అంగీకరించనని ఆయనకు తెలుసు. ఇంక ఈ సంగతినిగూర్చి యే మాత్రమూ విచారించకు" అంది అమాయకురాలు షెల్బీసతి.

మైనంతవఱకు అంకుల్‌టామ్‌ను మంచివారికే అమ్ముతానని హేలీ వాగ్దానం చేసాడు. కాని షెల్బీ కేమీ తృప్తి కలుగ లేదు. అయితే అతడేమీ చేయలేని నిస్సహాయ స్థితిలో నున్నాడు. హేలీ మాట్లాడకుండా ఆప్రదేశాన్ని విడచి వెళ్ళి పోయాడు.

# 4

ఆనాటిరాత్రి షెల్బీ, షెల్బీసతి గదిలో సమావేశ మయ్యారు. "మీరు మనయింటికి వచ్చిన వ్యాపారస్తుడికి అంకుల్ టామ్‌ను, హేరీని అమ్మివేస్తారని ఎలీజా చెప్పింది. మీరావిధంగా చేయరనీ, ఏవిధంగానూ భయపడవద్దనీ ఎలీజాకు అభయహస్త మిచ్చాను" అంది ఎలీజా.

"నేను డబ్బుచిక్కులలో పడ్డాను. డబ్బెక్కడా దొరక లేదు. అందుచేత అంకుల్ టామ్‌ను, హేరీని అమ్మటానికి అంగీక రింపవలసి వచ్చింది" అన్నాడు షెల్బీ.

"డబ్బుకోసమని వాళ్ళని అమ్మటమా? మనం నిజమైన క్రయిస్తవులమే! మానవుని జీవితం, డబ్బుకంటే వేయిరెట్లు విలువైనదని బోధించి యిప్పుడీవిధంగానా చేయడం?"

"వాళ్లనిద్దఱినీ అమ్మకపోతే మిగతా మనదగ్గఱనున్న బానిసలన్నందఱినీ అమ్మినప్పటికీ బాకీ తీరదు."

"బానిసల్ని ఉంచుకోటం పాపం. వాళ్ళ నమ్మటం మహాపాపం. నా నగలన్నీ యిస్తాను. అమ్మి డబ్బుచేసుకోండి. హేరీనిమాత్రం అమ్మకండి. ఎలీజాదుఃఖాన్ని నేనుచూడలేను."

"ఇంక నేను చేసేది ఏమీ లేదు. వారిద్దఱ్నీ అమ్మివేసే పత్రాలపై ఇదివఱకే సంతకం పెట్టాను."

ఎలీజా తలుపుచాటున నిలబడి యీ సంభాషణంతా వింది. ఆమె ఆశాసౌధము కూలిపోయింది! వెంటనే అక్కడనుండి గిరుక్కునతిరిగి తనగదిలోకి వెళ్ళింది. కొన్ని సామగ్రులు సిద్ధంచేసుకొంది. హేరీని లేపింది. తన్ను కృతఘ్నురాలినిగా భావించవద్దనీ, హేరీకోసం పారిపోతున్నానని ఒక చీటీ యజమానురాలికి వ్రాసింది.

ఎలీజా సామగ్రితోను, హేరీతోను అంకుల్ టామ్ ఇంటికి వెళ్ళింది. కొన్ని డబ్బుచిక్కులవల్ల అంకుల్ టామ్‌ను, హేరీని అమ్మివేయటానికి షెల్బీ నిశ్చయించటంచేత, తన హేరీని రక్షించుకోటానికి కెనడా పారిపోతున్నానని చెప్పింది. ఇదివిన్న ఆంట్ క్లో, అంకుల్ టామ్‌నుగూడా పారిపోవలసిందని హెచ్చరించింది.

"ఎలీజా పారిపోటంలో అర్థముంది. నేనుమాత్రం అట్లా చేసి కృతఘ్నుణ్ణి కాలేను. ఇంతవఱకూ నే నెప్పుడూ నమ్మక ద్రోహం చెయ్యలేదు. ఇకముందుకూడా చెయ్యను. నేనుగూడా పారిపోతే యజమాని సర్వనాశనమవుతాడు. మిగత బానిసలనందఱినీ అమ్మివేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది" అన్నాడు అంకుల్ టామ్.

"నాభర్త జార్జి కనబడితే నా సమాచారం ఆయనకు తెలియబఱచు" అని కోరింది ఎలీజా. తరువాత ఆచోటువీడి పోయింది.

# 5

మఱ్నాడు తెల్లవారింది. ఎలీజా షెల్బీయింట్లో లేదన్న విషయం బట్టబయలయింది. ఈవిషయం షెల్బీసతికి ఎంతో ఆనందాన్ని కలిగించిందని వేఱే వ్రాయనక్కఱలేదు. తరువాత సంగతులేమైనాసరే ఆమెకు కావలసిందల్లా ఎలీజా, ఆమె ప్రియపుత్రుడు హేరీ సురక్షితంగా ఉండటమే.

ఈవిషయం తెలిసినంతనే షెల్బీ పరవళ్లు త్రొక్కటం ప్రారంభించాడు. "ఇది హేలీకి తెలిస్తే ఏమనుకుంటాడు ? నేను మొదటినుంచీ వారంటే సానుభూతి వెలిబుచ్చటంచేత, వారు పారిపోవటానికి సహాయపడ్డానని అతడు అనుమానించాడా ?" అన్నదే షెల్బీ వాదన.

అంతట్లోకే హేలీ వచ్చాడు. అతనికి సంగతంతా తెలిసింది. తనది రవంతైనా తప్పు లేదన్నాడు షెల్బీ. కావాలంటే పారిపోయినవాళ్ళని వెదకి పట్టుకోటానికి గుఱ్ఱాల్ని యిస్తానన్నాడు. శామ్, ఆండీ అనే యిద్దఱు బానిసలు ప్రయాణానికి గుఱ్ఱాల్ని సిద్ధపఱచటానికి నియమింపబడ్డారు. కాని పారిపోయినవారిని పట్టుకోటం షెల్బీసతికి ఇష్టంలేదని ఆండీకి తెలుసు. ఆవిషయాన్నతడు శామ్‌కు చెప్పాడుగూడాను. అంచేత వారిరువురూ సాధ్యమైనంత ఆలస్యం చేయటానికి నిశ్చయించుకున్నారు.

శామ్ గుఱ్ఱాలశాలలోకివెళ్ళి రెండు గుఱ్ఱాల్ని తీసుకువచ్చి, హేలీ గుఱ్ఱందగ్గఱ నిలబెట్టాడు. హేలీగుఱ్ఱం గెంతటం మొదలుపెట్టింది. దాన్ని శాంతపఱచటానికి కొడ్తున్నట్లు

నటిస్తూ, ఎవరూచూడకుండా దానిజీనుక్రింద కొన్ని ముళ్ళ కాయలు పెట్టాడు. అంతలోకే షెల్బీసతిగూడా అచ్చటకు వచ్చింది. గుర్రాల్ని చాలా జాగ్రత్తగాచూడాలని అతివేగంగా నడుపవద్దనీ హెచ్చరించింది.

ఇంతవఱకూ లోపల భోజనంచేస్తున్న హేలీ బయటకు వచ్చాడు. విజయగర్వంతో తనగుఱ్ఱంమీద ఎక్కాడు. దానిమీద కూర్చోగా నాముళ్లకాయలు గుఱ్ఱానికి గట్టిగా గుచ్చుకుని, చర్మంకోసుకుపోయింది. అమితమైన బాధగలిగింది. మిక్కుటమైన భయంగూడావేసింది. అంచేత అది తెగ గెంతి, హేలీని క్రిందపడవేసి దవుడుతీసింది. శామ్ దానికూడా పరుగెత్తాడు. మిగతా రెండుగుఱ్ఱాలుకూడా దానివెంబడి పడ్డాయి. అంతా అలజడిమయమైంది. హేలీ వరండాలో ఇటూఅటూ పచార్లుచేయటం మొదలుపెట్టాడు.

మూడు గంటలైన తరువాత శామ్, ఆండీలు మూడు గుఱ్ఱాల్ని యింటికి తీసుకొచ్చారు. అంతలో షెల్బీసతివచ్చి హేలీని లోపలికి భోజనానికి ఆహ్వానించింది. బానిసలు గుఱ్ఱాల్ని శాలలోకి తీసుకువెళ్ళారు. తమ యజమానురాలి యిష్టాన్ని నెరవేర్చినందువల్ల తమకు మంచిభోజనం తగులు తుందని వారు ఎంతో సంతోషించారు.

## 6

రాత్రి కటికిచీకటి. అంతాచలి. అయినా ఎలీజా కుఱ్ఱ వాణ్ణి ఎత్తుకొని ప్రయాణంచేసింది. ఆమె భగవంతుని

ధ్యానించడం మరవలేదు. తెల్లారేటప్పటికి వారు కొన్ని మైళ్ళ దూరం ప్రయాణంచేసారు. తరువాత రెండుచోట్లఆగి భోజనాది కార్యాలు నిర్వర్తించారు. సాధ్యమైనంత త్వరలో ఓహియో నదినిదాటి ఓహియోస్టేటులో జేరుతే ఇంకేమీ భయముండ దని ఆమె ఉద్దేశం.

సూర్యాస్తమయంకాకపూర్వమే ఆమె ఓహియోనదిని చేరుకుంది. కాని నది వరదలతోవుంది. ప్రకృతి ఆమెకు ప్రతికూలమైంది. ఆసమయంలో దాన్ని దాటటానికి వీల్లేదు. అంచేత సమీపంలోనున్న సత్రవుకువెళ్లింది. పడవలేవీ నదిలో నడవటంలేదని తెలిసికొంది. సత్రవు యజమానిభార్య ఆమెకు సర్వ సదుపాయాలూ చేసింది. కాని ఎలీజా మనస్సేమీ బాగుండలేదు.

షెల్బీసతి హేలీని భోజనానికి పిల్చిందని ఇదివఱకు చదివాం. అతనికి భోజనం పెట్టటంలో అంతా ఆలశ్యమే జరిగింది. అదేమికర్మమో అన్నిలోపాలూ అప్పుడే గుమి గూడాయి. సాధ్యమైనంతవఱకు ఆలస్యం చేయటంకోసం షెల్బీసతి పన్నిన ఎత్తుగడ అది అని వేరేచెప్పనక్కరలేదు. హేలీమాత్రం ఆలస్యానికి మండిపడుతున్నాడు.

హేలీని అనుసరించటానికి అంకుల్ టామ్ సిద్ధమ య్యాడు. తాను నిజమైన క్రయిస్తవుణ్ణనీ; యజమాని మాట లకు ఎప్పుడూ వ్యతిరేకంగా పోలేదని; అంచేత పారిపోవటానికి ప్రయత్నించననీ హామీ యిచ్చాడు. తరువాత హేలీ, శాం, ఆండీ గుఱ్ఱాలమీద ఓహియో నదీతీరానికి బయలుదేరారు.

కొంతసేపు తప్పుదారిని పోవడంవల్ల ఆలస్యమయింది. ఏలాగైతేనేమి, ఎలీజా చేరిన గ్రామానికి, ఎలీజా చేరిన గంట తరువాత చేరుకున్నారు. శామ్, ఎలీజానుచూచి గట్టిగా అరిచాడు. ఎలీజా అపాయాన్ని గుర్తించి, పిల్లవాణ్ణి ఎత్తుకొని బయటపడింది. నదీతీరాన్ని చేరింది. హేలీ ఆమెను గుర్తించి వెంటపడ్డాడు.

ఎలీజా దైవంపై భారంవేసి నదిలోదిగింది. ఎంతబాధ పడుతున్నా ముందుకు సాగిపోయింది. దైవం ఆమెకు శక్తి నిచ్చాడు. ఆమె ఎట్టకేలకు ఓహియోతీరాన్ని చేరింది. అచ్చట ఆమెకు ఇదివరకే పరిచితుడైన సైమ్సు సహాయం చేశాడు. ఎలీజాకు ఒక తెల్లవారి యింటికి దారిచూపాడు.

హేలీ, ఎలీజా ధైర్యసాహసాలకి ఆశ్చర్యపడ్డాడు. పారిపోయినందుకు మండిపడ్డాడు. శామ్, ఆండీ నవ్వటం మొదలు పెట్టేసరికి వార్ని కొరడాతో కొట్టాడు. వారు గుఱ్ఱాలెక్కి పారిపోయి చాలారాత్రి అయ్యేసరికి ఇల్లుచేరుకున్నారు. ఎలీజా తప్పించుకుపోయిన శుభవార్తను షెల్బీసతికి తెలియజేశారు. ఆమె దేవుణ్ణి అభినందించింది.

## 7.

సైమ్సు చూపెట్టిన యింట్లో సెనెటరుబర్డ్ కుంపటి ప్రక్కన కూర్చుని హాయిగా టీ త్రాగుతున్నాడు. భార్య గూడా అక్కడేవుంది. "ఏమండీ, ఈమధ్య కెంటుకీస్టేటునుండి,

ఓహియోస్టేటుకు పారిపోయివచ్చే బానిసలకు ఆశ్రయం ఇవ్వ కూడదని మీ సెనేట్ సభవారు క్రొత్తగా శాసనం చేసారటగా ? ఏ క్రయిస్తవ ప్రభుత్వమైన ఇలా చేస్తుందిటండీ ?" అని ఆమె భర్తను ప్రశ్నించింది.

"కెంటుకీవాళ్ళు గోలపెడుతున్నారు. వాళ్ళను తృప్తి పరచటం కోసమని ఆశాసనం చేసాం" అన్నాడు సెనేటర్ బర్డ్.

ఈవిధంగా వాళ్ళు సంభాషిస్తున్న సమయంలో ఎలీజా వారి గృహాన్ని చేరుకుంది. అప్పుడామె స్థితి దుర్భరంగాఉంది. కాళ్ళవెంబడి రక్తం కారుతూంది. గుడ్డలన్నీ చినిగిపోయాయి. ఆ యింటి సేవకుడు ఎలీజా రాకను యజమానులకు తెలియ జేశాడు. వారు వెళ్ళిచూసేటప్పటికి ఎలీజా స్పృహతప్పివుంది. ఎలీజాకు, హేరీకి వారుఉపచారాలు చేశారు. ఎలీజా తేరుకుంది.

సెనేటరు దంపతులు, ఎలీజాను, హేరీని కుంపటిప్రక్క పడుకో బెట్టారు. నిద్రలోగూడా ఎలీజా, హేరీని గట్టిగా కౌగలించుకునేయుంది. కొంతసేపయ్యాక ఎలీజా నిద్రమేల్కొంది. తరువాత ఆమె తన చరిత్రనంతనీ సెనేటరుదంపతులకు విశదంగా తెలియజేసింది. తాను కెనడాకు పారిపోతున్నట్లు చెప్పింది. ఓహియోనదిని దాటినవైనం చెప్పినపుడు వారందరూ ఆశ్చర్యపోయారు. ఎలీజా కథ వారి హృదయాలను ద్రవింపజేసింది. కెనడాకు వెళ్ళే విషయం తరువాత చూస్తానని సెనేటర్ బర్డ్ అన్నాడు.

సెనేటర్ బర్డ్ పరిస్థితి అయోమయంగాఉన్నది. కెంటుకీ నుంచి పారిపోయి వచ్చిన బానిసలకు ఆశ్రయం ఈయకూడదని

శాసనం చేయబడిన తరువాత, ఎలీజాకు ఆశ్రయమిచ్చి తాను చేసిన శాసనాన్నే భగ్నపరచవలసిన పరిస్థితి ఏర్పడింది. హేలీ కనుక వచ్చినపుడు తన యింట ఎలీజా దొరికితే అంతకంటె చిక్కు విషయం వేరే ఉండదు. అంచేత ఆరాత్రే ఎలీజాను, హేరీని ఇంకో సురక్షిత ప్రదేశానికి పంపివేయటానికి నిశ్చయించుకున్నాడు. అచ్చటికి కొన్ని మైళ్ళ దూరంలోనే అతడి స్నేహితుడు వాన్‌ట్రాంపె ఉన్నాడు. అక్కడికి వెళ్ళే రోడ్డు గతుకులుగా ఉండడంచేత ఎవరూ వెళ్ళరు. అంచేత తల్లిని, కొడుకుని అక్కడకు పంపాలనుకున్నాడు. అర్ధరాత్రి వేళ తానే స్వయంగా బండిపై వారినిద్దరినీ తీసుకెళ్ళాలని సెనేటర్‌బర్డ్ నిశ్చయించాడు. బుద్ధితక్కువైనా, మంచిహృదయం ఉన్నందుకు బర్డ్‌సతి ఎంతోసంతోషించింది.

అర్ధరాత్రిఐంది. బండివచ్చి వాకిట్లోనిలబడింది. బర్డ్‌సతి కడసారికుమారుడు నెలరోజుల క్రితమే చనిపోయాడు. ఆమె ఆ కుఱ్ఱాడి దుస్తులన్నీ మూటకట్టి ఎలీజాకిచ్చింది. ఎలీజావారి ఉపకారానికి ఎంతో సంతోషించింది. కృతజ్ఞతను తెలియపరచటానికి ఆమెకు మాటలు రాలేదు.

బండి ప్రయాణం సాగించింది. కాని రోడ్డంతా గతుకులుగా ఉండటంమూలాన బండి అంతవేగంగా పోవటంలేదు. సెనేటర్‌బర్డ్ అతి కష్టంతో బండిని పోనివ్వగలిగాడు. చివరకెలాయితేం బండి వాన్‌ట్రాంపె యిల్లుచేరుకుంది. వాన్‌ట్రాంపె మేల్కొన్నాడు. సంగతంతా తెలుసుకున్నాడు.

వాన్ ట్రాంపె స్ఫురద్రూపి. చాలా ఆజానుబాహు మనిషి. మనిషి కొట్టొచ్చినట్లుంటాడు. కాని హృదయం వెన్న కంటె మెత్తనైనది. చాలా దయార్ద్రహృదయుడు. అతను లోగడ కెంటికీలో నివసించాడు. అతి మెత్తని హృదయం కలవాడవటంచేత ఆ రాష్ట్రంలో బానిసల్ని పెట్టబడుచున్న బాధల్నిచూచి సహింపలేకపోయాడు. అందువలన కెంటుకీ రాష్ట్రాన్ని వదిలేసి, ఓహియోరాష్ట్రానికివచ్చి నివాసమేర్పరచుకున్నాడు. ఎలీజాను, ఆమె కుమారుణ్ణి సరిగ్గాచూస్తానని వాన్ ట్రాంపె వాగ్దానం చేసాడు. వాళ్ళను లోపలికి తీసికెళ్ళివిడిచి, సెనేటరును మళ్ళీకలుసుకున్నాడు. సెనేటరు అతనిని వీడివస్తూ చేతిలో పదిడాలర్ల నోటు పెట్టాడు.

# 8

అంకుల్‌టాం తన క్రొత్త యజమానీ హేలీననుసరించటానికి సిద్ధపడుతున్నాడు. ప్రొద్దున్నే లేచి బైబిలు పారాయణం ప్రారంభించాడు. ఆంట్‌క్లో విచారానికి అంతంటూ లేదు. అంకుల్‌టాం దక్షిణాది రాష్ట్రాల్లో ఎంతో కష్టపడి, మరణిస్తాడని ఆంట్‌క్లో ఊహిస్తోంది. అతన్ని అమ్మేసినందుకు షెల్బీని నిరసించింది. అంకుల్‌టాం అంతా భగవదిచ్ఛ అని అన్నాడు. “షెల్బీచేసిన తప్పేమీలేదు. అటువంటి యజమానిదగ్గఱ మీరుండటం మీ అదృష్టం” అన్నాడు అంకుల్‌టాం.

ఆనాడు ఆంట్ ఖ్లో, అంకుల్ టాం కోసం ప్రత్యేకంగా భోజనపదార్థాలు తయారుచేసింది. అతని బట్టలనన్నిటినీ ఒక చిన్నపెట్టెలోకి సర్దింది. అంతలోకీ వారిపిల్లలు నిద్రనుండి లేచారు. పిల్లలు తలిదండ్రుల దుస్థితిని చూచి ఎంత ఏడ్చారో చెప్పటానికి వీల్లేదు. హేలీ వచ్చిందే తడవుగా అతన్ని అనుసరించటానికి అంతా సిద్ధంగావున్నాడు. అంతట్లోకే షెల్బీసతి గూడా అక్కడకు వచ్చింది. ఆమె అంకుల్ టాం వెళ్ళిపోతోన్నందుకు ఎంతో విచారిస్తోంది. "మా ఆర్థికపరిస్థితి బాగుపడగానే నువ్వు ఎక్కడున్నా సరే, ఎంతఖర్చయినాసరే నిన్ను తిరిగి కొనేస్తాము" అని ఆమె అంకుల్ టాంకు హామీ యిచ్చింది.

హేలీ అక్కడకు అతిచిరాగ్గా వచ్చాడు. ఎలీజా అతనికి దొరక్కపోవటమే దానికి కారణం. అంకుల్ టాం తన పెట్టె తీసుకొని బండిఎక్కాడు. అనేకమంది బానిసలు చుట్టూ గుమిగూడి ఎంతగానో విలపించారు. బండి కదలకపూర్వమే హేలీ, అంకుల్ టాం కాళ్ళకు సంకెళ్ళువేస్తాడు. సంకెళ్ళు వేయవలసిన అవసరంలేదని షెల్బీసతి నచ్చచెప్పబోయింది కాని హేలీ కది రుచించలేదు. బండి బయలుదేరింది.

కొంతదూరము పోయినతరువాత హేలీ తనదగ్గరనున్న సంకెళ్ళను వదులుచేయించి అంకుల్ టాం చేతులకుగూడా వేసాడు. తిన్నగా వారు వాషింగ్టన్ వెళ్ళారు. అంకుల్ టాం పారిపోకుండా ఒక చీకటికొట్లో బధింపబడ్డాడు.

మఱుసటిరోజు పదకొండు గంటలకు వాషింగ్టనులో బానిసల అమ్మకం ప్రారంభమయింది. బానిసలలో మగ, ఆడ అన్నివయస్సులవారూ ఉన్నారు. హేలీ అక్కడకు వెళ్ళి ఇద్దఱు వయస్సువచ్చిన పురుషుల్నీ, ఒకపిల్లవాణ్ణీ కొన్నాడు. వాళ్లకుగూడా సంకెళ్లువేసి, అంకుల్‌టాం వున్న చీకటికొట్లో బంధించాడు.

కొన్నిరోజులయిన తరువాత హేలీ మిస్సిసిపినదిమీద ప్రయాణంచేసే పెద్ద పడవమీద ప్రయాణం సాగించాడు. కూడా కొన్న బానిసలున్నారు. త్రోవలో ఇంకా కొంతమంది బానిసల్ని కొన్నాడు.

ఆపడవలో స్వతంత్రులైనవారు పైభాగాన్న కూర్చుని ప్రకృతి దృశ్యాల్ని చూస్తూ ఆనందిస్తున్నారు. లోపల బానిసలు గుమిగూడి ఉన్నారు. వారందఱూ చుట్టపక్కాల నుండి వేఱుచేయబడి ప్రయాణం చేస్తున్నారు.

# 9

ఎలీజా క్వేకర్ సెటిల్మెంటు చేరుకుంది. (క్వేకర్సు లేక ఫ్రెండ్సు అని పిలువబడే క్రయిస్తవులు శాంతికాముకులు. యుద్ధ వ్యతిరేకులు- అట్టహాసం, డంబంలేని సామాన్య జీవితం గడుపుతారు. బానిసత్వానికి వీరు వ్యతిరేకులు, అంచేత బానిసలు తప్పించుకు పోటంలో సహాయపడేవారు.) అక్కడ ఆమె ఒక తెల్లవారి యింట్లో వంటయింట్లో కూర్చునిఉంది. అక్కడ

వేడికోసమని ఒకకుంపటి ఉంది. దాని పక్కే మంచి కుర్చీలు గూడా ఉన్నాయి.

ఎలీజా ప్రక్కనే క్వేకర్ సంఘానికి చెందిన 60 ఏండ్ల లోపు స్త్రీ రాషెల్ హాల్లీడే కూర్చునిఉంది పండ్లను శుభ్రం చేస్తూ. ఎలీజా తన యిచ్చవచ్చినంతకాలం ఆయింట్లో ఉండ వచ్చునని రాషెల్ అంది. కాని, కెనడా వెళ్ళాలనే ఉద్దేశ్యం ఇంకా ఎలీజా మానుకోలేదు. హేలీ అక్కడకు వస్తాడని, తన్నుపట్టుకుని తీసుకుపోతాడని ఆమె భయపడుతోంది. ఏమీ భయంలేదని, ఆ ఊళ్ళో ఆమె ఆచోకీ ఎవరూ ఈయరని, రాషేల్ ఎంత నచ్చజెప్పినా ఎలీజా భయం తగ్గలేదు.

ఎలీజా, రాషెల్ మాట్లాడుకుంటూవుండగా రాషెల్ భర్త సిమియన్ హాల్లీడే అక్కడకు వచ్చాడు. అతడు తన భార్యకు సంతోషకరమైన సమాచారాన్ని అందజేశాడు. అది ఎలీజాకు ఆనందకరమైన సమాచారం. ఏమంటే ఎలీజా భర్త జార్జి ఆరోజుననే ఆ ఊరు జేరుకున్నాడు. అంతేకాదు ఆ సాయంకాలమే వారి యింటికి వస్తాడు.

అనుకున్నట్లుగానే జార్జి ఆ రోజు సాయంకాలంవారి యింటికి వచ్చాడు. ఎలీజా ఆనందానికి మితిలేదు. ఆ రాత్రి వారిరువురూ సుఖసముద్రములో మునిగి తేలారు.

మఱునాటి ప్రొద్దున ఆ యిల్లు కళకళలాడుతూఉంది. ఇంట్లో వారందఱూ తెల్లవారగట్లాలేచారు. ఇల్లంతా పరి శుభ్రంచేశారు. ప్రొద్దుట భోజనానికి కావలసిన పదార్థాలన్ని

త్వరగా తయారు చేసారు. ఇదంతా జార్జిని, ఎలీజాను గౌర వించటానికి చేయబడింది.

అందరూ భోజనాలకు కూర్చున్నారు. ఇది జార్జి జీవి తంలో చాలా అపూర్వదినం. జార్జి (నీగ్రో) తెల్లవారి సరసన కూర్చుని భోజనం చెయ్యటం, అతని జీవితంలో ఇదే మొదటి పర్యాయం. మొదట్లో అతనికెలాగో ఉంది. కాని త్వరలో అతనికి అమిత సంతోషం కలిగింది. అందరిముఖాల్లోను దేవుని ప్రేమ ప్రకాశిస్తూ ఉండటం అతను చూచాడు. దేవుడు అతని హృదయంలో గూడా ప్రవేశించాడు. అతనిలోనున్న దురభిప్రాయాలు సమసిపోయాయి.

వారి కుటుంబంలో పారిపోయిన బానిసలు జార్జి, ఎలీజాలున్నట్లు కనుక్కోబడితే వారు అపాయంలో పడ్డారన్న మాటే. కాని వారు ధర్మసంరక్షణార్థం ఎట్టి అపాయన్నైనా ఎదుర్కోటానికి సిద్ధంగా వున్నారు. అయినా జార్జి, ఎలీజా తమ పుత్రునితో సహా ఆ రోజే ముందుకు సాగిపోటానికి నిశ్చ యించుకున్నారు.

# 10

హేలీ, టాం, ఇతరబానిసలు పడవమీద చాలారోజులు ప్రయాణం చేసారు. టాం అందటికీ అవసరం వచ్చినపుడల్లా సాహాయ్యంచేసి తలలో నాలుకవలె మెలిగేవాడు. పని లేనప్పుడు బైబిలు పారాయణం చేసేవాడు. హేలీకిగూడా

అంకుల్‌టాం నిజాయితీమీద నమ్మకం కుదిరింది. అంచేత సంకెళ్లు వెయ్యటం మానేసాడు.

ఆపడవలోనే ప్రయాణంచేస్తున్న స్వతంత్రుల్లో సెంట్ క్లేర్ అనే ధనవంతుడున్నాడు. అతను న్యూ ఆర్లియన్సు నగరానికి ప్రయాణం చేస్తున్నాడు. అతనికూడా కుమార్తె ఎవాంజలిన్, మరో దగ్గరబంధువు ఒఫేలియాకన్య ఉన్నారు.

టాం ఎవాంజిలిన్‌ను రోజూ చూచేవాడు. ఆఅమ్మాయి అతణ్ణి ఆకర్షించింది. ఆమె చాలా అందమైనది. చక్కగా మాట్లాడుడూ పడవలో అటూ ఇటూ చలాకిగా తిరుగు తుండేది. టాం ఆమెతో స్నేహంచెయ్యాలనుకుని ప్రయత్నం చేసాడు. మొదట్లో ఆ అమ్మాయి బిడియపడంది కాని చివరకు ఇద్దఱూ గాఢమిత్రులు అయ్యారు. ఒకరి సంగతి నొకరు తెలుసుకున్నారు. "నువ్వంటే నాకు చాలాయిష్టం. నిన్ను నీయజమాని అమ్మివేసేటట్లయితే, కొనవలసిందని మా నాన్న గారి నడుగుతాను. మానాన్నగారు నామాట త్రోసివెయ్యరు" అంది ఎవాంజిలిన్. "మంచిదే. అలాగేచెయ్యి" అన్నాడు అంకుల్ టాం.

పడవ ఒకపట్టణంవద్ద ఆగింది. ఎవాంజిలిన్ తన తండ్రిని కలుసుకోటానికి పరుగెత్తుకుపోయింది. అంకుల్‌టాం ప్రయాణీకులకు సహాయం చెయ్యటానికి క్రిందకు వెళ్ళిపోయాడు. సెంట్‌క్లేర్, ఎవాంజిలిన్ పడవ పైభాగమున అంచుకు దగ్గరగా నిలబడి చూస్తున్నారు. అంతలో పడవ హఠాత్తుగా కదిలింది. ఎవాంజిలిన్ జారి నీటిలోబడింది.

క్రిందభాగాన్న ఉన్న టాం ఈదృశ్యాన్ని చూచాడు. వెంటనే అతడు నీళ్లలోఉరికి ఈదుకుంటూ ఆమె పడినచోటికి వెళ్ళాడు. ఆమెను తనచేతుల్లో చిక్కించుకుని, ఈదుకుంటూ తిరిగి పడవలోకివచ్చాడు. తరువాత ఆమెను సురక్షితంగా తండ్రిదగ్గరకు చేర్చాడు.

సెయింట్ క్లేర్, హేలీతో బేరంచేసి అంకుల్‌టాంను కొనేసాడు. ఈసంగతి తెలియని ఎవాంజిలిన్, అంకుర్‌టాంను సుఖపెట్టటంకోసం అతన్ని కొనివేయమంది. "ఇదినబికే కొనేసాను" అన్నాడు సెంట్ క్లేర్. అంకుల్‌టాంను, సెంట్ క్లేర్‌కు అమ్మేసినట్లు హేలీ పత్రం వ్రాసియిచ్చాడు. సెంట్ క్లేర్, హేలీకి డబ్బుయిచ్చాడు. ఈ బేరంలో చాలాడబ్బు లాభం వచ్చినందుకు హేలీ ఎంతో సంతోషించాడు.

తన క్రొత్తయజమాని దయామయుడన్న విషయాన్ని అంకుల్‌టాం యిట్టే గ్రహించేసాడు. అంకుల్‌టాంకు గుఱ్ఱాల్ని తోలటం బాగాతెలుసు. కనుక అతన్ని గుఱ్ఱపుబండి తోలేవాడిగా ఉంచటానికి నిశ్చయింపబడింది.

# 11

సెంట్ క్లేర్ న్యూఆర్లియన్సు ధనవంతుల్లో ఒకడు. అతడిభార్యా మేరీ సెంట్ క్లేర్. ఆమె చాలా అందమైనది. స్వంతంగా ఆదాయంవచ్చే ఆస్తి ఆమెకు చాలావుంది.

ఎవాంజలిన్ వారి ఏకైకపుత్రిక. సెంట్ క్లేర్ ఆమెను అతి ప్రేమతో చూస్తుండేవాడు.

భర్తకు భార్యకూ చాలాతేడావుంది. భార్య మేరీ స్వార్థపరురాలు. ఎంతసేపూ తనగొడవే చూసుకునేది. పిల్ల గొడవ ఆమెకు ఏమాత్రమూ పట్టేదిగాదు. భర్తగూడా తన కాలాన్నంతనీ ఆమెకోసమే వినియోగించాలని ఆమె ఉద్దేశ్యం. ఆమెకెప్పుడూ శరీరంలో స్వస్థత ఉండేదికాదు. ఇవ్వాళ్ల ఒక జబ్బువుతే, రేపు ఇంకోజబ్బు తయారయ్యేది. మఱి ఎవాంజిలిన్ గూడా అరిపేదపిల్ల. అయినా తల్లి ఏమాత్రం శ్రద్ధతీసుకునేదికాదు.

అందుకునే సెంట్ క్లేర్, ఎవాంజిలిన్‌ను న్యూ ఇగ్లండులో నున్న తన దగ్గరబంధువుల యింటికి తీసుకువెళ్లాడు. అక్కడ వారిద్దఱూ ఒక నెలరోజులపాటు సుఖంగా కాలక్షేపం చేసారు. తరువాత వారిద్దఱూ తిరిగి వచ్చేటప్పుడు ఒఫేలియాకన్యను గూడా కూడా తీసుకొచ్చారు. ఒఫేలియాకన్య చాలా నిజాయితీపనది. ఆమెకు అన్నిసంగతులూ తెలుసును. ఆమె ఇంటివిషయం, ఎవాంజిలిన్ ఆరోగ్యవిషయం శ్రద్ధగా చూస్తుంది. అప్పుడు మేరీ ఎలావున్నా ఎవరికీ నష్టంఉండదు. ఈ తిరుగుప్రయాణంలోనే అంకుల్‌టాం, ఎవాంజిలిన్ మిత్రులయ్యారు.

పడవ న్యూఆర్లియన్సు పట్టణంచేరుకుంది. పడవలోంచి సెంట్ క్లేర్, ఎవాంజిలిన్, ఒఫేలియా, అంకుల్‌టాం దిగారు. వారికోసం మంచి బండిఒకటి సిద్ధంగాఉంది. అందఱూ అదిఎక్క-

మనోహరమైన వీధులగుండా ప్రయాణంచేసి ఒకగొప్ప భవంతిని చేరుకున్నారు.

కాంపౌండు గేటులోనుంచి బండి లోపలికి పోయింది. కాంపౌండు చాలా అందంగాఉంది. నీటిని పైకి తుంపర్లు తుంపర్లుగా చిమ్ముతుండే గొట్టాలు, ఆకుపసందు మొక్కలు, పూలమొక్కలు మున్నగువాటితో కాంపౌండంతా చాలా అందంగాఉంది. ఆ దృశ్యం చూచి అంకుల్‌టాం తన్మయుడయ్యాడు.

అందరూ ఇంట్లోకి వెళ్లారు. మేరీ పడుకొని ఉంది. ఎవాంజిలిన్ ఆమెదగ్గరకు పరుగెత్తికెళ్ళింది కాని నిరాదరణ పొందింది. టాం అనే క్రొత్తసేవకుణ్ణి తీసుకొచ్చినట్లు సెంట్ క్లేర్ భార్యతో చెప్పాడు. "అబ్బో ఈ గదిలో ఉంటానికి చాలా పెద్దవాడు!" అని పెదవి విరిచింది. ఇంటి తాళం చెవులన్నీ మేరీ, ఒఫేలియాకు ఇచ్చేసింది. అంటే ఇంక ఇంట్లో పనులన్నిటికీ ఒఫేలియా యజమానురాలన్నమాట.

ఎవాంజిలిన్, అంకుల్‌టాం తోటలో సరదాగా కాలం గడిపేవారు. ఆటలాడేవారు. పాటలు పాడేవారు. కాలం హాయిగా దొర్లిపోయేది. అంకుల్ టాంకు మంచిబట్ట, మంచి తిండి దొరుకుతోంది. సుఖంగా జీవితం గడచిపోతోంది.

# 12

ఎలీజా, జార్జి, హేరీ క్వేకర్ సెటిల్మెంటునుండి ముందుకు ప్రయాణం చెయ్యబోతున్నారు. రాషెల్ హాల్లీడే

వారికి కొన్ని ఆహార పదార్థములు మూటకట్టియిచ్చింది. అంతలో ఫిన్యాస్ ఫ్లెచర్ అనే క్వేకరు అక్కడకు వచ్చాడు. అతడు వారితో ఇలా అన్నాడు. "కొంతమంది పారిపోయి వచ్చిన బానిసలు ఈగ్రామంలో తలదాచుకొన్నారనేవార్తను అక్కడక్కడ చెప్పుకుంటున్నారు. ఆ బానిసల్ని పట్టుకొని, పారిపోయి వచ్చిన ప్రదేశానికిపంపేసి, బహుమతుల్ని పొందాలని కొంతమంది స్వార్థపరులు ప్రయత్నం చేస్తున్నారు. బానిసలు ఈ రాత్రికి ఇక్కడనుంచి బయలుదేటిపోతారనే సంగతి వారికి తెలుసు. బానిసల్ని వెంబడించి పట్టుకోవాలని వారను కుంటున్నారు."

"ఏమీ భయంలేదు. ఇవిగో రెండుపిస్తోలులు, ఎవడొచ్చినా సరే పేల్చిపారేస్తాను" అన్నాడు జార్జి.

భోజనాలు పూర్తిఅయాయి. ప్రయాణానికి బండి సిద్ధంగా ఉంది. బండిలో జిమ్ అనే నీగ్రోబానిస, అతని తల్లి ఉన్నారు. జార్జి, ఎలీజా, హేరీ బండి ఎక్కారు. సిమియన్ అందరికీ వీడ్కోలిచ్చాడు. బండి ప్రయాణం సాగించింది. ఫిన్యాస్ ఫ్లెచర్ బండి తోలున్నాడు.

ఏ అపాయం లేకుండా ప్రయాణం సాగిపోయింది. తెల్లవారగట్లా మూడుగంటలయింది. వెనకాల గుఱ్ఱపుడెక్కల చప్పుడయింది. ఒక క్వేకరు స్నేహితుడు వచ్చాడు. బండి ఆగింది. క్వేకరు బండిలోనివారితో ఇలాఅన్నాడు, "వెనకాలే మిమ్మల్ని పట్టుకోటానికి కొంతమంది వస్తున్నారు. త్వరగా

పోనివ్వండి" దూరాన్న గుఱ్ఱపు డెక్కల చప్పుడు వారికి విన బడింది.

ఫినాస్ ఫ్లెచర్ శరవేగాన్న బండిని తోలుతున్నాడు. త్రోవలో చాలా ఎత్తయిన కొండలు వచ్చాయి. అందఱూ బండిదిగి కొండలు ఎక్కి క్రిందనుండి కనపడని ప్రదేశములో దాక్కున్నారు. వీరందఱూ కొండలెక్కటం వెనకాల వారు చూసారు. వారుగూడా అక్కడే ఆగారు. జార్జి వారికి కనబడేటట్టుగావచ్చి యిలా అన్నాడు, "రండి పైకి, పిస్తోళ్ళతో పేల్చి పారేస్తాను."

క్రిందనున్నవాడు పిస్తోలును పేల్చాడుగాని జార్జి తప్పుకు న్నాడు. తరువాత వారందరూ పైకి ఎక్కటం మొదలు పెట్టారు. ఒకడు బానిసలున్నచోటికి దూకటానికి ప్రయత్నిస్తుం డగా జార్జి పిస్తోలుతో పేల్చాడు. వాడింకా దూకబోతుండగా, ఫినాస్ ఫ్లెచర్ వాణ్ణి క్రిందకు తోశాడు. వాడు క్రిందకుదొర్లి పడ్డాడు. మిగతావారందరూ భయపడిక్రిందకుదిగి, గాయపడిన వాణ్ణి వదిలేసి వెళ్ళిపోయారు. అప్పుడు ఫినాస్, బానిసలు క్రిందకుదిగి గాయపడినవాణ్ణి బండిలో ఎక్కించుకుని ముందుకు సాగిపోయారు. మళ్ళీ ఒక క్వేకరు ఇంటివద్దఆగారు.

# 13

సెంట్ క్లేర్ ఇంట్లో టాం జీవితం చాలా సుఖంగా గడుస్తోంది. అతనికి ప్రత్యేకం గుఱ్ఱపుశాలపై ఒకగదినిచ్చారు.

అందులో ఒక మంచం, పక్క, కుర్చీ, టేబిలు ఇంకా ఇతర అవసర సామాగ్రి ఉన్నాయి. ఒకనాడు అంకుల్‌టాంకు, భార్యకు ఉత్తరం వ్రాయాలని బుద్ధిపుట్టింది. వెంటనే ఒక పలక తీసుకుని దానిమీద వ్రాయటం ప్రారంభించాడు. కాని యీ మధ్య చదువుమానివేయటంచేత కొన్నిమాటలు మర్చి పోయాడు. కొన్నిమాటల స్పెల్లింగుగూడా మర్చేపోయాడు. అంతలో ఎవాంజిలిన్ అక్కడకు వచ్చింది, ఉత్తరంవ్రాయ టంలో ఆమె అంకుల్‌టాంకు సహాయపడింది. ఇద్దరూకలసి ప్రయత్నంచేశారు.

"మా నాన్నతో చెప్పి, నువ్వొకసారి నీ ఇంటికెళ్ళి నీ వాళ్ళనందర్ని చూడటానికి సెలవిప్పిస్తాను" అంది ఎవాంజిలిన్. అంకుల్‌టాం ఎంతో సంతోషించాడు. అంతట్లోకే సెంట్ క్లేర్ కూడా అక్కడకు వచ్చాడు. అతనికి అంకుల్‌టాం ఉత్తరం సంగతి తెలిసింది. ఉత్తరంలో వ్రాయవలసిన సంగతులన్నీ తెలుసుకున్నాడు. ఆ సాయంత్రమే అంకుల్‌టాం వ్రాసినట్లు ఓ ఉత్తరం వ్రాసి టపాలో వేయించాడు.

హాయిగా రెండు సంవత్సరాలు గడిచి పోయాయి. టాంకు సర్వసౌకర్యాలూ సమకూరుతున్నాయి. కాని యింటి కెళ్ళి పెళ్ళాంబిడ్డలను చూడాలని కుతూహల పడుతున్నాడు. వేసవికాలం వచ్చింది. పట్టణంలో వేడి హెచ్చుగా నుండటం వల్ల సెంట్ క్లేర్ కుటుంబంవారందరూ సముద్రపుటొడ్డునఉన్న ఒకకుటీరానికి వెళ్ళారు. శీతోష్ణస్థితి మారినా ఎవాంజిలిన్ పరిస్థితి యేమీ బాగుండలేదు. ఆమె ఆరోగ్యం నానాటికి

క్షీణింపజొచ్చింది. కొంచెం గట్టిగా నడచినా, ఆడుకున్నా అలిసిపోయేది.

ఒకనాడు ఎవాంజిలిన్ పరిస్థితి చాలా అధ్వాన్నంగా తయారయింది. వెంటనే డాక్టర్ని పిలుచుకొచ్చి హడావుడి చేశారు. ఎవాంజిలిన్ పరిస్థితి అంత బాగుండలేదని అప్పుడర్థమయింది మేరీకి. అప్పుడయినా ఆమె తన ఆరోగ్యం చూసుకుందేగాని, పిల్లకేమీ చేయలేదు. ఎవాంజిలిన్‌కు సర్వ ఉపచారాలు ఒఫేలియా, సెంట్‌క్లేర్ చేసేవారు.

ఎవాంజిలిన్ తన సేవకుల్ని అమితంగా ప్రేమించేది. వాళ్ళకి తనచేతనైన సహాయం చేయాలని ఆమె అభిలాష. బానిసలందరూ స్వతంత్రులుగా ఉంటే బాగావుంటుందని ఆమె ఉద్దేశ్యం. బానిసలను దుర్భరపరిస్థితినుండి తప్పించాలని ఆమె సంకల్పం. ఈ విషయాన్నే ఆమె ఓరోజున తండ్రితో చెప్పింది.

"నేను ఈ ప్రపంచంలో ఇంక ఎన్నాళ్ళో జీవించను. త్వరలోనే దేవుడిదగ్గరకు వెళ్ళిపోతాను. మన సేవకులందరూ ఎంతో మంచివారు. నేనంటే వారికెంతో అభిమానం. వారికి స్వేచ్ఛయిచ్చేస్తే బాగుంటుందనిపిస్తోందినాకు. దేశంలో బానిసత్వం అనేది వుండకూడదని నీవు బాగా ప్రచారంచెయ్యాలి. నాది ఇంకోముఖ్యమైన కోరికఉంది. నేను ఈ ప్రపంచాన్ని వదలి వెళ్ళిపోయినతరువాత టామ్‌కు స్వేచ్ఛను ఇచ్చివేయాలి."

"నీకు ఇష్టం వచ్చిన పనిని దేన్నిగాని చెయ్యటానికి నేనెప్పుడు సిద్ధమే" అన్నాడు సెంట్‌క్లేర్.

సెంట్ క్లేర్ మనస్సు వికలమై పోయింది. కూతుర్ని ఆమె గదిలోకి తీసికెళ్ళి పడుకోబెట్టి నిద్రపోయేటంతవఱకు పాటలు పాడాడు.

రోజులు గడుస్తున్నాయి. ఎవాంజిలిన్ ఆరోగ్యం కృష్ణ పక్షచంద్రునిలా క్షీణిస్తోంది. అమావాస్య దగ్గరపడింది. అస్థి పంజరంమాత్రమే మిగిలింది. మాంసాదులుహరించిపోయాయి. ఆమె బైబిలును చదువుతూనో, నదీదృశ్యాల్ని చూస్తూనో కాలంగడిపేది.

ఒకనాడు ఒఫేలియాచేత తన అందమైన జుట్టునంతనీ కత్తిరింపించుకుంది. ఇంట్లో ఉన్నవారందరినీ దగ్గరకు పిలిపించు కుని వారితో ఇలాఅంది, " నేను ఈ లోకాన్ని వదలిపెట్టి జీసస్ మహనీయుడున్న గొప్పలోకానికి వెళ్తున్నాను. మీరు ఆయనను ప్రార్థించండి. బైబిలును చదవండి. చదవటంచేత కాకపోతే ఇతరులచేత చదివించుకుని వినండి. మీరందఱూ నేనంటే ఎంతోఅభిమానంగా వున్నారు. నాజ్ఞాపక చిహ్నంగా మీరందరూ నా వెంట్రుకల చుట్టలను దగ్గరవుంచుకోండి. మీరందరూ క్రమక్రమంగా దైవసాన్నిధ్యానికి వస్తారు. అప్పుడు తిరిగి కలుసుకుందాం."

అక్కడనున్న వారందరూ ఆమాటలు విని విచార సముద్రంలో మునిగిపోయారు. ఆమెయిచ్చిన వెంట్రుకల చుట్టలను తీసికొని బయటకు వెళ్ళిపోయారు. చివరకు ఎవాంజి లిన్, అంకుల్టామ్‌ను ప్రత్యేకంగా పలుకరించి ఒక అందమైన వెంట్రుకలచుట్టనిచ్చి "మనమిద్దరం మళ్ళీ దేవుడుదగ్గర కలుసు కుందాం"అంది.

ఎవాంజిలిన్ మరణం కడు సమీపానికి వచ్చింది. అంకుల్‌టాం ఎప్పుడూ ఆమెదగ్గరే ఉండేవాడు. రాత్రిళ్ళు ఆమె పడుకున్న గదికి బయట వరండాలో పడుక్కునేవాడు. ఒఫేలియాగూడా తగిన సపర్యలు చేసేది. ఇటువంటి స్థితిలో గూడా తల్లిమేరీకి, కూతురుకు పరిచర్యచేయటానికి తీరిక ఉండేదికాదు.

ఆఖరురోజు. ఎవాంజిలిన్ పరిస్థితి కొంచెం మెరుగుగా ఉన్నట్లు కనబడింది. కాని అర్ధరాత్రి అయ్యేసరికి హీనస్థితికి దిగజారింది. అంకుల్‌టాం డాక్టరును తీసుకొచ్చాడు. కాని డాక్టరు చేసేది ఏమీ లేకపోయింది. సెంట్ క్లేర్ దుఃఖం ఇంతింత అని చెప్పటానికి వీల్లేదు. ఎవాంజిలిన్ తండ్రికేసి చూసి చిరునవ్వునవ్వింది. ప్రాణం గిజిగిజలాడుతోంది. "అంతా అయిపోయింది" అన్నాడు అంకుల్‌టాం. ఆమెముఖంపై, దేవ లోకాన్ని చూస్తున్నట్లు, మందహాసం తాండవిస్తోంది. "ప్రేమ ఆనందం, శాంతి" అంటూ ఎవాంజిలిన్ దేవలోకానికిప్రయాణం చేసింది.

# 14

ఎవాంజిలిన్ అంత్యక్రియలు పూర్తిఅయిన కొద్దిరోజుల తరువాత, సెంట్ క్లేర్ కుటుంబంవారు సముద్రతీరపు ఇంటినుంచీ నగరంలోని భవంతికి చేరుకున్నారు. సెంట్ క్లేర్, కుమార్తె మరణ దుఃఖాన్ని మరచిపోటానికి శతవిధాల ప్రయత్నాలు చేసేవాడు. అస్తమానూ స్నేహితుల్ని దర్శిస్తూ వుండేవాడు;

మాట్లాడుతుండేవాడు; నవ్వుతుండేవాడు. సెంట్ క్లేర్ హృదయము ఎవరికీ తెలియదు. హృదయంలో దుఃఖాగ్నిని కప్పిపుచ్చటానికి సెంట్ క్లేర్ ఇలా చేస్తున్నాడని ఎవరూ అనుకోలేదు. మేరీగూడా తన భర్త నిజంగా దుఃఖాన్ని మర్చిపోయాడని భ్రమపడింది.

ఒకనాడు సెంట్ క్లేర్ లయిబ్రరీ రూంలో కూర్చొని ఎవాంజలిన్ చదువుకునే బైబిలు చదువుతున్నాడు. అంతట్లోకీ అంకుల్ టాం అక్కడకు వచ్చాడు. సెంట్ క్లేర్ ముఖం విచారంతో వివర్ణమైంది.

"ఈ ప్రపంచమంతా మిథ్యగా కనబడుతోంది. బైబిలును చదవటంవల్ల నాకేమీ ఓదార్పు చేకూరటంలేదు. క్రైస్తు ఉన్నాడని నీకెలా తెలుసు?" అన్నాడు సెంట్ క్లేర్.

"మీ అభిప్రాయం సరియైనదికాదు. భగవంతుడు నాకు కాంతి, ఆనందం, శాంతి ప్రసాదిస్తున్నాడు. అతడు నాలో ఉన్నట్లు నాకు తెలుసు. అతనివల్లనే నేను ప్రతిపని చేయగలుతూ, జీవయాత్ర గడుపుతున్నాను" అన్నాడు అంకుల్ టాం.

సెంట్ క్లేర్ బైబిలు చదువుతుండగా, టాం విన్నాడు. టాం ముఖం ప్రకాశించసాగింది. తరువాత టాం ప్రార్థన సల్పాడు. ఎవాంజలిన్‌కు అతిదగ్గరగా వెళ్ళినట్లు తోచింది సెంట్ క్లేర్‌కు.

అప్పటినుంచీ సెంట్ క్లేర్‌కు బైబిలులో నమ్మకం కుదిరి, వీలైనపుడల్లా చదువుతుండేవాడు. టాంఅంటే అతనికి మంచి

అభిప్రాయం దినాదినాభివృద్ధి చెందింది. టాంకు స్వేచ్ఛ ప్రసాదించటానికి తగిన చర్యలు తీసుకోసాగాడు. "నేను నీకు త్వరలో స్వేచ్ఛను ప్రసాదిస్తాను. మూటాముల్లే కట్టుకొని కెంటుకీకి పోవటానికి సిద్ధంగావుండు" అని అంకుల్ టాంను హెచ్చరించాడు గూడాను. కాని విధి వేఱుగా తలచింది.

సెంట్ క్లేర్ సాయంత్రం షికారుకు వెళ్ళాడు. అంకుల్ టాం ఇంటిదగ్గరే వున్నాడు. చీకటి పడింది. అప్పుడు కొంత మంది మనుష్యులు సెంట్ క్లేర్‌ను మోసుకొచ్చారు. సెంట్ క్లేర్ అపాయస్థితిలో నున్నాడు. జరిగిన కథ ఇది : సెంట్ క్లేర్ ఆ సాయంత్రం ఒక హోటలుకు వెళ్ళాడు. అక్కడ యిద్దరు పోట్లాడుకోసాగారు. సెంట్ క్లేర్ వారిని విడదీయటానికి వెళ్లాడు. అప్పుడు పోట్లాడుతోన్న వారిలో ఒకడు పొరపాటున సెంట్ క్లేర్ పక్కలో కత్తితో పొడిచాడు. వెంటనే అతడు పడి పోయాడు.

సెంట్ క్లేర్ పరిస్థితినిచూచి అందఱూ ఎంతగానో దుఃఖించారు. చేయవలసిన పరిచర్యలన్నీ చేసారు. డాక్టరువచ్చి చూచి యింక ఏమీ లాభంలేదన్నాడు; టాం తన యజమాని కొఱకు అనేక ప్రార్థనలుసల్పాడు. సెంట్ క్లేర్ మరణించాడు.

సెంట్ క్లేర్ మరణంతో ఆయింటిలోని సేవకులందఱూ కష్టదశలో పడ్డారు. ఇంతవరకూ సెంట్ క్లేర్ వారి సుఖం కోసం ప్రయత్నం చేసేవాడు. ఇప్పుడు వారు తనసుఖమేతప్ప ఇతరుల సుఖమంటే యేమిటో ఎఱుగని స్వార్థపరురాలి చేతిలోపడ్డారు. ఆమె స్వార్థపరురాలుమాత్రమే కాదు. బుద్ధి

హీనురాలుగూడా. అటువంటి స్త్రీ చేతిలో అధికారం ఎలా ఉంటుందో వేరే చెప్పనక్కర్లేదు.

ఒఫేలియా ఇంకా ఆ ఇంట్లో ఉన్నమాట నిజమే. ఆమె దయామయురాలంటంలోగూడా ఏమీ సందేహంలేదు. అయితే యజమానురాలిని వ్యతిరేకించి ఏమి చేయగలదు? ఒకనాడు ఆ యింట్లో పనిచేసేఆమ్మాయి ఒకామెవచ్చి ఒఫేలియా కాళ్ళమీద పడింది. "నన్ను రక్షించండి. యజమానురాలు నన్ను కొరడాలతోకొట్టే గృహానికి పంపిస్తోంది" అని వాపోయింది. ఒక చీటీనిగూడా చూపెట్టింది. అది మేరీ చక్కని వ్రాతతో కొరడాతోకొట్టే గృహయజమానికి వ్రాసిన చీటీ. అందులో ఆ చీటీపట్టుకొచ్చిన అమ్మాయిని 15 గట్టి దెబ్బలు కొట్టమనిఉంది. కొంచెం మొరటుగా ప్రవర్తించినందుకుగాను మేరీ ఆ అమ్మాయికి ఆ శిక్షను విధించింది.

ఈవిషయం తెలియగానే ఒఫేలియా, మేరీదగ్గఱకు వెళ్లి ఆ అమ్మాయికి విధించిన శిక్షను ఆపుచేయించమని కోరింది. "మాటవినని సేవకులకు అది ఒక గుణపాఠం. నేను విధించిన శిక్ష ఇంకా చాలాతక్కువ" అని మేరీ, తాను విధించిన శిక్షను రద్దుచేయటానికి నిరాకరించింది. ఆ ఇంట్లో సేవకుల పాట్లు అల్లాడున్నాయి. టాప్సీ అనే అమ్మాయిమాత్రం పూర్తిగా ఒఫేలియాకు చెందినదవటంవల్ల క్షేమంగాఉంది.

మేరీ తన ఇంటినీ, సేవకుల్నీ అమ్మేసి తండ్రిగారింటికి వెళ్ళిపోవటానికి నిశ్చయించుకుంది. ఈ వార్త సేవకులకు విచారం కలిగించింది. కొంతమంది సేవకులుమాత్రం రాబోయే

యజమానైనా మంచివాడు కాకపోతాడా అని సంతో షించారు.

అంకుల్‌టాం ఒఫేలియాకన్యను కలుసుకుని తనకు సెంట్ క్లేర్ స్వాతంత్ర్యం వాగ్దానం చేసిన సంగతి గుర్తుకు తెచ్చాడు. ఆవిషయాన్ని మేరీకి తెలుపవలసిందిగా కోరాడు. ఒఫేలియా ఆవిషయాన్ని మేరీకి తెలిపి టాంకు స్వాతంత్ర్యాన్ని ప్రసాదించవలసిందిగా గట్టి సిఫారసు చేసింది. కాని స్వార్థ పరురాలైన మేరీ ఆవిధంగా చేయటానికి నిరాకరించింది. "అందఱూ నన్ను పీక్కు-తినేవాళ్ళే!" అంది. భర్త కడపటి కోరికను ఆమె ఆవిధంగా గౌరవించింది!

మఱునాడే అంకుల్‌టాం, మరికొందఱు సేవకులు రాబోయే వేలంపాటలో అమ్మకంకోసం బానిసగృహానికి పంపబడ్డారు.

# 15

బానిసగృహయజమానులు అంకుల్ టాంనీ, ఇతరుల్నీ ఒకపొడుగాటి గదిలోకి తీసికెళ్లారు. అక్కడ అన్నిరకాల బానిసలూ వున్నారు. కొంతమంది నవ్వుతున్నారు. కొంత మంది ఇతరుల్ని అపహాస్యంచేస్తున్నారు. కొంతమంది మాట్లా డుతున్నారు. ఈ విధంగా వారు తమ విచారాన్ని దిగమ్రింగి కాలాన్ని గడపటానికి ప్రయత్నం చేస్తున్నారు.

బానిస గృహంలోనే ఇంకోభాగంలో ఆడవారికోసమని ఓ గది ప్రత్యేకింపబడియుంది. అందులో అన్నివయసులవారూ వున్నారు. వారు సుమారు ఓ ఏభై మందిఉన్నారు. అందులో ఒక పదిఏళ్ళ అమ్మాయి గొంతుచించుకు ఏడుస్తోంది. పాపం, ఆ అభాగ్యురాలు తల్లిని అనాడే పోగొట్టుకుంది. తల్లి ఆమె నుండి వేరుచేయబడి అమ్మివేయబడింది.

ఆగదిలో ఒకమూల ఒకతల్లి ఆమెకూతురు కూర్చొని ఉన్నారు. కూతురుకు పదిహేను సంవత్సరాలు ఉంటాయి. వాళ్ళు నల్లగా ఉన్నా పూర్తి స్త్రీగోలుకారు. వారుచక్కని దుస్తులు ధరించి గౌరవమైన అలవాట్లు కలిగియుండటం మూలాల, ఒకమంచి గృహంనుంచి వచ్చారనిఊహించవచ్చు. వారి యజమానురాలు మంచిదే. పాపం చనిపోయింది. ఆమె కుమారుడు డబ్బుకాశపడేవాడవటం మూలాన సాధ్యమైనంత ఎక్కువ ధరకు వారిని అమ్మివేయటానికి సిద్ధపడ్డాడు. పాపం, తల్లి కూతురు ఏకధారగా ఏడుస్తున్నారు. ఆ అమ్మాయి (ఎమెలిన్ ఆమెపేరు) చాలా అందమైనది. "నేను ఈ అమ్మాయిని చిన్నప్పటినుండీ పెంచి పెద్దదాన్ని చేసాను. ప్రేమించాను. బైబిలు బోధించాను. భగవంతుని మహత్తును తెలిపి ఆయనలో విశ్వాస ముండేటట్లు చేశాను. ఆమెను ఒక పెన్నిధిగా చూచుకుని సంతోషించాను. ఇప్పుడు దీనిగతి యేమవుతుందో కదా!" అని తల్లి విచారించటం మొదలుపెట్టింది.

న్యూఆర్లియన్సులో బానిసల అమ్మకం చాలావిరివిగా జరుగుతుంది. ఆనాడు బానిసలందరూ మార్కెటుకు తీసుకు

రాబడ్డారు. కొనేవారు బానిసల్ని తెగపరీక్ష చేస్తున్నారు. ఒకమూరికి గుడ్డలు కట్టుకున్నవాడు టాం దగ్గరకు వచ్చి, నోరు తెరచి పళ్ళుచూపెట్టమని, కండలు చూపెట్టమని, గెంతమని నానా రకాలుగా పరీక్ష చేశాడు. చివరకు పరిశుభ్రంగానున్న టాం చెప్పులమీద ఉమ్మేశాడు. వారి మదోన్మత్తత అలా గున ఉంది !

అమ్మకం ప్రారంభమయింది. ఎవరివంతు వచ్చినపుడు వారు అమ్మబడుతూ వచ్చారు. అంకుల్ టాం వంతు వచ్చింది. ఇదివరకే టాంను పరీక్ష చేసిన లెగ్రీ అనేవాడు కొనేశాడు. ఎమెలిన్ తల్లిని ఒక దయామయుడు కొన్నాడు. తనకూతుర్ని గూడా కొనెయ్యవలసిందని ఆమె అతణ్ణి ప్రాధేయపడింది. ఆ దయామయుడు అందుకు అంగీకరించాడు. కాని పాట పెరిగి పోయేటప్పటికి వెనుదీశాడు. ఎమెలిన్‌ను లెగ్రీకొనేశాడు. ఆ విధంగా తల్లీ కూతుళ్ళిద్దరూ విడదీయబడ్డారు. ఇటువంటి సంఘటనలెన్నో జరుగుతూనే ఉన్నాయి.

# 16

లెగ్రీ, టాం ఒక చిన్నపడవలో ప్రయాణం చేస్తున్నారు. త్రోవలో లెగ్రీ యింకా కొంతమంది బానిసల్ని కొన్నాడు. టాం కాళ్లు, చేతులు గొలుసులతో కట్టివేయబడ్డాయి. మిగతా వాళ్లనందరినీ ఇద్దరిద్దరుచొప్పున గొలుసులతో కట్టేసాడు.

లెగ్రీ బానిసలందరినీ పరీక్షించటం మొదలుపెట్టాడు. టాం యింకా పరిశుభ్రమైన మంచిదుస్తులే ధరించి ఉన్నాడు. లెగ్రీ అదిచూచి సహింపలేకపోయాడు. టాం పెట్టెలోంచీ అతడు గుఱ్ఱందగ్గర పనిచేసేటప్పుడు ధరించేదుస్తులు తీసాడు. టాం తొడుకున్న మంచిదుస్తుల్ని విప్పించి పాతదుస్తులు తొడిగించాడు. అయితే టాం బైబిలును తన లాగూజేబుల్లో దాచుకోటం మర్చిపోలేదు. లెగ్రీ టాం కోటుజేబు వెదికాడు. అందులో ఎవాంజిలిన్‌కు సంబంధించిన కొన్నివస్తువులున్నాయి. వాటిని టాం యింతవరకు ఎంతో ప్రాణప్రదంగా దాచుకుంటున్నాడు. లెగ్రీ వాటిని నదిలోకి విసిరేసాడు. టాం సిల్కు చేరుమాలును, లెగ్రీ తనజేబులో దాచుకున్నాడు. అంతలో టాం ప్రార్థనాగ్రంథం కనబడింది. "హుం! నీకు మతంకూడా ఉందన్నమాట! ఇకనుంచీ నీకు చర్చి, సర్వస్వమూ నేనే. తెలిసిందా! జాగ్రత్త!" అని హుంకరించాడు. కాని టాంకు బైబిలులో చెప్పబడిన వాక్యాలన్నీ జ్ఞాపకమున్నాయి.

ఇంకా లెగ్రీ టాం ట్రంకులోని వస్తువులన్నిటినీ అమ్మేసాడు. చివరకు ట్రంకునుగూడా అమ్మేసాడు. "నువ్వు నీవస్తువులను కాపలాకాసే బాధ్యత తప్పించాను" అన్నాడు లెగ్రీ.

తరువాత టాం ఎమెలిన్‌దగ్గఱకు వెళ్ళాడు. వాడి వాలకంచూచి అసహ్యించుకుని ఎమెలిన్ దూరంగా వెళ్ళిపోయింది. అప్పుడు లెగ్రీ తన పిడికిలిచూపి, బానిసల్ని గుద్దటంలో అది బండబారి ఇనుంలా తయారయిందన్నాడు.

ఎమెలిన్‌కీ, ఒక జబ్బుతోవున్న మనిషికీ కలిపి గొలుసులు కట్టబడిఉన్నాయి. పాపం, ఆ జబ్బుతోవున్న మనిషి ఆమె భర్తనుండి, నలుగురు పిల్లల్నుండి విడదీయబడింది. ఆమె దుఃఖం భగవంతుడికే ఎరుక.

చివరకు ఆపడవ ఒక చిన్నపట్టణం చేరుకుంది. లెగ్రీ, అతనిబానిసలు అక్కడ దిగారు. ఆడవాళ్లు సామానుతోసహా ఒకబండిలో కుక్కబడ్డారు. మగవాళ్లు వెనకాల నడవ సాగారు. వారందఱూ ఆవిధంగా ఒకరోజల్లా ప్రయాణంచేసి లెగ్రీ తోటల్ని చేరుకున్నారు.

బండీ లెగ్రీగృహం చేరుకుంది. మగవాళ్లు వెనకాలే ఉన్నారు. ఇంట్లోంచి ఇద్దఱు రాక్షసరూపులైన నీగ్రోలు బయటకువచ్చారు. వారే సాంబో, క్వింబో అనేవారు. యజమానిచెప్పే క్రూరమైనపనులన్నిటికీ వారేతయారవుతారు.

ఎమెలిన్ యజమానియింట్లోకి పంపించబడింది. టాం ఉండటానికి సాంబో అసహ్యకరమైన పూరి గుడిసెల్ని చూపెట్టాడు.

# 17

అంకుల్‌టాం అక్కడ తాను చేయవలసిన పనిని త్వరలోనే నేర్చుకున్నాడు. కాని అతడికి అక్కడిజీవితమంటే అసహ్యం వేస్తోంది. అయినా అతడు భగవంతుడియందు నమ్మకం ఉంచాడు.

అంకుల్‌టాం చాలా తెలివైనవాడు. నేర్పరి. అంచేత అతణ్ణి తన ప్రధాన సహాయకుడుగా నియమించుకోవాలనుకున్నాడు లెగ్రీ. అయితే లెగ్రీ పనులు అంకుల్‌టాంకు ఏమాత్రం నచ్చలేదు. టాం మంచితనం లెగ్రీకి నచ్చలేదు. లెగ్రీ యజమానికాబట్టి టాంకు క్రూరపనులు చేయటంలో తర్ఫీదు నివ్వాలనుకున్నాడు.

ప్రొద్దున్న లేచిందగ్గరనుంచీ సాయంకాలంవరకూ బానిసలందరూ ప్రత్తిచేలల్లోకి వెళ్ళి ప్రత్తినితీసి బుట్టలలో కూరేవారు. ఆబుట్టల్ని వీపుమీద పెట్టుకుని సూర్యాస్తమయం వేళకు తూకంవేసే ప్రదేశాలకు చేరేవారు. ప్రతిబుట్టనీ అక్కడ తూకంవేసేవారు. ఏబుట్టయినా, నిర్ణయింపబడిన తూకానికి తక్కువఉంటే ఆబుట్ట తెచ్చిన బానిసకు శిక్ష విధింపబడిందన్నమాటే.

ఒకనాటి ఉదయం ఒక క్రొత్త స్త్రీ ప్రత్తి ఏరుతూ ఉండటం అంకుల్‌టాం చూసాడు. ఆ స్త్రీపేరు కేసీ. ఆమె పొడుగ్గా, బక్కపలచగాఉంది. బట్టలు చాలా పరిశుభ్రంగా ఉన్నాయి. ఒకానొకప్పుడు ఆమె చాలా అందంగాఉండేదని చెప్పొచ్చు. ప్రస్తుతం ఆమెవయస్సు ముప్పదిఐదు సంవత్సరాలు ఉంటుంది. అమెముఖంలో బాధ, విచారం ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. ఆరోజున టాం, ఆ స్త్రీకి ప్రక్కనే పని చేస్తున్నాడు. పాపం, ఆ స్త్రీ జబ్బుతో బాధపడుతూ పని చేయలేకుండాఉంది. టాం దయతలచి తాను ఏరిన ప్రత్తిని అప్పుడప్పుడూ ఆమెబుట్టలో వేయసాగాడు. ఇది సాంబో

చూసాడు. నిర్దయతో ఆమె స్పృహతప్పేదాకా తన్నాడు. టాంను ముఖంమీద కొరడాతో కొట్టాడు.

ఆ స్త్రీ తరువాత మళ్లీ పనిచేయవలసివచ్చినపుడుగూడా టాం ఆమెకు సహాయంచేసాడు. టాం యొక్క దయనుచూసి ఆమె చాలా సంతోషించింది. తాను ఏరినప్రత్తి కొంతతీసి టాం బుట్టలో వేసింది. మళ్ళా సాంబో వచ్చాడు. కేసీని కొరడాతో కొట్టాలనుకున్నాడు. కేసీ తన భయాన్నిగొల్పే కళ్లు పెద్దవిచేసిచూసింది. "నామీద దెబ్బపడిందా, జాగ్రత్త!" అంది. సాంబోకు భయంవేసింది. ఏమీ అనకుండానే వెళ్లిపోయాడు.

"టాం, కేసీకి పనిలో సహాయం చేస్తున్నాడు" అని సాంబో ఆసాయకాలంమే లెగ్రీకి ఫిర్యాదుచేసాడు. "సరే, దాన్ని టాంచేతే కొట్టించి వాళ్లిద్దరిరోగం కుదురుస్తానుఉండు" అన్నాడు లెగ్రీ ఎక్కువకోపంతో. సరే, ఆ సాయంకాలం మామూలుగానే ప్రత్తిబుట్టలు తూచబడ్డాయి. కేసీబుట్ట పూర్తితూకం కలిగిఉంది. అయినా అది తక్కువగాఉందని లెగ్రీ మండిపడ్డాడు. అప్పుడు కేసీ ముందుకు వచ్చి ఫ్రెంచి భాషలో ఏమో మాట్లాడింది. అప్పుడు లెగ్రీకి కోపమూ వచ్చింది, భయమూవేసింది. కేసీ వెళ్ళిపోయింది.

లెగ్రీ టాంని కేకవేసి యిల్లా అన్నాడు,"నీకు ఓవర్‌సీర్ పనియిస్తున్నాను. అందులో నీకు తర్ఫీదు ఇవ్వాలికదా, కనుక వెంటనే నీవువెళ్ళి కేసీని తెగబాదిరా." టాం ఆవిధంగా చేయటానికి సుతరాం అంగీకరించలేదు. లెగ్రీకోపించి టాం ముఖం

మీద కొట్టాడు. ముఖంనుండి రక్తం కారసాగింది. టాం ఆ రక్తాన్ని తుడుచుకుంటూ, కేసీ జబ్బుగావుండనీ, అంచేత ఆమెను కొట్టటం తప్పనిఅన్నాడు. "నేను చావనన్నా చస్తాను గాని, ఆమెను కొట్టడం అనే నీచమైన పనిని ఏ మాత్రమూ చేయను" అన్నాడు టాం. లెగ్రీకికోపంవచ్చి టాంను నానా విధాలుగా తిట్టి బూటుకాలితో గట్టిగా తన్నాడు. అంతటితో సంతృప్తిచెందక సాంబో, క్వింబోలను పిలిచి "వీణ్ణి ఈడ్చుకెళ్లి పడేసి తన్నండి" అన్నాడు. వారు టాంను ఈడ్చుకుపోయారు.

# 18

టాం ఒక గుడిసెలో రక్తం కక్కుకుంటూ, బాధపడుతూ పడి ఉన్నాడు. అతనికి దాహం వేస్తోంది. కాని నీళ్లు తెచ్చియిచ్చే వారెవరూ లేరు. భగవంతుణ్ణి ప్రార్థించి నీళ్లు కావాలని గట్టిగా కేక పెట్టాడు. అప్పుడు కేసీ లోపలికివచ్చి టాంకు కావలసినన్ని నీళ్ళు ఇచ్చింది. తరువాత సరిగ్గా పక్క వేసి దానిమీద అతణ్ణి పండుకో బెట్టింది. అతని గాయాలకు కట్లుకట్టి మందువేసింది. "నీవుచాలా ధైర్యవంతుడవు. న్యాయమూర్తివి. నీ యజమాని పెనుభూతం. అటువంటివాడితో నువ్వు తగువుపడొద్దు" అని చెప్పింది. "అన్నిటికీ భగవంతుడున్నాడు" అన్నాడు టాం. "భగవంతుడు లేడు. ఒకవేళ వున్నా అతడికి మనమాటలు వినబడవు" అంది కేసీ.

"నేను లెగ్రీదగ్గర ఐదుసంవత్సరాలనుంచిఉంటున్నాను. అతడి క్రూరత్వం నాకు బాగా తెలుసు. ఇప్పుడు ఎమెలిన్‌కు నా గతే పట్టేటట్లుంది. అయినా ఆమె దేవుడియందు పూర్తి నమ్మకం కలిగియుంది. ఇటువంటి నరకంలోఉంటే ప్రార్థనల వల్ల లాభమేమీ లేదు" అని గూడా చెప్పింది కేసీ.

టాం, కేసీచేత తన బైబిలు తెప్పించాడు. అందులో ఏసుక్రీస్తు తుదిఘడియలను వర్ణించే ఘట్టాన్ని కేసీచేత చదివించాడు. "తండ్రీ, హింసపెడ్తూన్న వారికి వారేం చేస్తున్నారో తెలియదు. అందుచేత వారిని క్షమించు" అనేవాక్యం చదివే సరికి కేసీకండ్లవెంబడి నీరు కారసాగింది.

"బాధ పడ్డంతమాత్రాన మనం దేవుడు లేడనకూడదు. ఆయన మనకు తప్పకుండా సహాయం చేస్తాడు"అన్నాడు టాం.

తరువాత కేసీ తన విషాదగాథను టాంకు చెప్పసాగింది.

"నేను ఒక ధనిక కుటుంబంలో పెంచబడ్డాను. తరువాత కాన్వెంటుబడిలో చేరి సంగీతం, కుట్టుపని, అల్లికలు మున్నగునవన్నీ నేర్చుకున్నాను. అయితేనేం ? నాతల్లి బానిస. నా తండ్రి చనిపోయాడు. అప్పుడు నేను ఒక మంచి యువకుడికి అమ్మబడ్డాను. నేను ఆయనతో చాలా సంవత్సరాలు జీవించాను. ఒకపిల్లవాడు, ఒకఅమ్మాయి పుట్టారు. అంతట్లోకి ఆ యువకుడు బీదవాడయ్యాడు. అంచేత నన్నూ నా పిల్లల్ని అమ్మివేశాడు. నన్ను మంచి యజమానికొన్నాడు. అయితే నా పిల్లలేమైందీ నాకు తెలియదు. నాకు మళ్ళీ ఇంకోకొడుకు పుట్టాడు. వాడిభవిష్యత్తు అంధకారంగా వుంటుందని నాకు

తెలుసు. అందుచేత వాడికి రెండు వారాల వయస్సప్పుడు విషమిచ్చి చంపేశాను. అప్పటి యజమానిగూడా చచ్చిపోయాడు. తరువాత చాలామంది యజమానులు మారారు. చివరకు క్రూరుడైన లెగ్రీచేతిలో పడ్డాను."

అంకుల్ టాం, కేసీ చరిత్రవిని చాలా విచారపడ్డాడు. "భగవంతుణ్ణి ప్రార్థించు. ఆయన నిన్ను తప్పకుండా రక్షిస్తాడు" అన్నాడు. "ఎక్కువ మాట్లాడకుండా నిద్రపొండి" అంది కేసీ. టాం ప్రక్కన మంచినీళ్ళుంచి అక్కడనుంచి వెళ్ళిపోయింది.

# 19

అదిమంచి పనులకాలం. అంచేత అంకుల్ టాంను కొట్టించినందుకు లెగ్రీచాలా బాధపడుతున్నాడు. ఏమంటే గాయాల వలన ఇంకాకొద్దిరోజులదాకా అతడు పనిచేయలేడు. ఇదంతా లెగ్రీకి నష్టమే. ఈ ఆలోచనలతో లెగ్రీ విచారిస్తూ కూర్చునియుండగా కేసీవచ్చింది.

లెగ్రీదగ్గరఉన్న ఐదుసంవత్సరాలల్లోను, కేసీ క్రమక్రమంగాలెగ్రీపై కొంతఅధికారంసంపాదించింది. ఆమె ఎక్కువగాబాధపడటం మూలాన్న, ఒక్కొక్కప్పుడు పిచ్చెత్తుతూంటుంది. అ సమయాల్లో లెగ్రీ ఎక్కువగా భయపడతాడు.

"లెగ్రీ, నీకు నేను స్పష్టంగా చెబుతున్నాను. నువ్వు ఎన్నన్నా ప్రయత్నాలుచెయ్యి. టాంను మాత్రం క్రూరుణ్ణి చెయ్యలేవు" అంది కేసీ.

అదే సమయంలో సాంబో లోపలికివచ్చాడు. అప్పుడు టాం ఎలావున్నాడో చూద్దామని కేసీ వెళ్ళిపోయింది. లెగ్రీ విచారానికి అంతులేదు. అంచేత క్వింబోనుగూడా తనదగ్గరకు పిలిపించుకున్నాడు.

సాంబో, క్వింబో, లెగ్రీలు అనేక విషయాలు మాట్లాడుకుంటూ అనేక ద్రాక్షసారాసీసాలు కాళీచేసారు. మత్తెక్కిపడిపోయారు. మఱునాఁడు ఉదయం కేసీ అక్కడకు వెళ్ళి చూసేటప్పటికి, లెగ్రీ యింకా మత్తునిద్రలోనే ఉన్నాడు. అప్పుడే ఁతడు లేచి మళ్ళీ బ్రాఁదీ త్రాగటం మొదలుపెట్టాడు. అప్పుడు కేసీ అతనితో ఇలాఅంది, "టాంను అతనిమానాన్న అతణ్ణి వుండనివ్వండి. అతణ్ణి హెచ్చుదరకు కొన్నారు. ఏమీ పనిచెయ్యనియ్యకుండా ఉన్నారు. ఇది మీ తెలివితక్కువ కదా! టాంను పనిచేయనీయకపోతే పంట చాలా నష్టమవుతుంది."

పంటనష్టమనేటప్పటికి లెగ్రీమనస్సులో కొంచెంకదలిక కలిగింది. "టాం తానుచేసింది తప్పని ఒప్పుకుంటే అతణ్ణి క్షమిస్తాను" అన్నాడు లెగ్రీ. "టాం ఎప్పటికీ అలా ఒప్పుకోడు. అతణ్ణి చంపండి, ఏమైనా చెయ్యండి" అంది కేసీ.

లెగ్రీ టాం దగ్గరకువెళ్ళి బూటుకాళ్ళతోతన్ని, తన్ను క్షమించవలసిందని కోరవలసిందని అన్నాడు. టాం కదలలేదు. అప్పుడు లెగ్రీ అతణ్ణి కొరడాతో కొట్టాడు. "నిన్ను చెట్టుకు కట్టివేస్తాను. చుట్టు మంట పెడ్తాను. నీవు మెల్లిమెల్లిగా ప్రాణాలు కోల్పోతావు" అని బెదిరించాడు లెగ్రీ.

"నన్ను ఏమన్నా చెయ్యండి, నేనుమాత్రం క్రూర మైన పని యేదీ చేయలేను. మీరు నన్ను దయతో చూస్తే మీకునమ్మిన బంటునవుతాను. నేను మీకు చేతుల్తోమాత్రమే పనిచేస్తానుగాని నా ఆత్మను ఇవ్వను" అన్నాడు టాం. అప్పుడే కేసీ వచ్చి తను టాంను మళ్ళీపనికి వచ్చేటట్లు చేస్తా ననీ, లెగ్రీని వెళ్ళిపొమ్మనీ ఫ్రెంచిభాషలో అంది. టాం సంగతి గుండెల్లో మెదుల్తూనే ఉంటుందంటూ లెగ్రీవెళ్ళి పోయాడు.

# 20

ఎలీజా, ఆమె భర్త జార్జి, వారి కుమారుడు హేరీ మున్నగువారందరూ ఇంకో క్వేకర్ల ఇంటిని జేరుకున్నారు. గాయపడిన లోకర్‌కు ఆయింటివారు తగినపరిచర్యలు చేసారు. అతని గాయాలన్నీ చక్కగామాని, పూర్వపు మనిషిలాగా, ఇంకోక్కొత్తమనిషిలాగ తయారయ్యాడు. ఎలీజా మున్నగు వారికి సంబంధించిన ఆనవాళ్ళన్నీ పోలీసువారిదగ్గర ఉన్నా యనీ, వారు తమ వేషాలు మార్చేసి వెంటనే ఎక్కడికయినా వెళ్ళిపోవటం ఉత్తమమని లోకర్ అన్నాడు.

జిమ్, అతడితల్లి ఒక ముఠాగాను, జార్జి, ఎలీజా, హేరీ ఒకముఠాగాను విడిపోయారు. జార్జి మున్నగువారు ఈరీసరస్సు తీరాన్ని చేరుకున్నారు. కెనడా చేరాలంటేవారు ఈరీసరస్సును దాటాలి. అక్కడ బానిసత్వంలేదు. సంపూర్ణ స్వేచ్ఛఉన్నది. అంచేత వారు కెనడా చేరుకుంటే సురక్షితంగా ఉన్నట్లే.

మారువేషాలు వేసుకొని ఆ సరస్సును దాటాలని జార్జి నిశ్చయించుకున్నాడు. వారితోబాటు పడవలో ప్రయాణం చేయటానికి ఒక కెనడా స్త్రీ సమ్మతించింది. హేరీకి ఆడపిల్ల వేషం వేయటానికీ, ఆ కెనడా స్త్రీకి సంబంధించిన పిల్లగా ఉండటానికి ఏర్పాట్లు జరిగాయి. ఎలీజా ఒక మగపిల్లవాడి వేషం వేసుకోటానికీ, జార్జి ముసలివాడి వేషము వేసుకోటానికి ఏర్పాట్లు జరిగాయి.

ఎలీజా తన జుట్టును కత్తిరించేసుకుంది. మగపిల్లవాడి దుస్తులు ధరించింది. హేరీ ఆడపిల్ల వేషంలో బలే బాగున్నాడు. ఆవేషాలతో వారు పడవదగ్గరకు వెళ్ళారు. ఎక్కారు. పడవ కెప్టెనులకు అప్పటికప్పుడే ఒకపురుషుడు, ఒకస్త్రీ, ఒక పిల్లవాడు కలసివస్తే ఆపుచేసేయమని హెచ్చరికలు వచ్చాయి. కెనడా స్త్రీ స్మిత్ సతి పిల్లవేషంలోఉన్న హేరీనిచంక నేసుకుంది. ఎలీజా పిల్లాడి వేషంలో ఆ స్త్రీ పడవలో ఎక్కడానికి తగు సహాయంచేసింది. జార్జి ముసలివాడి వేషంలో ఆమె సామానులుమోస్తున్నాడు. అంచేత వారి నేపడవవారు పట్టుకోలేదు.

పడవబయలుదేరింది. ఈరీసరస్సు సగాన్నిదాటి కెనడా భాగంలో ప్రవేసించారు. చివరకు సరస్సు అవతలిఒడ్డును చేరుకున్నారు. అప్పుడు వారిఆనందం కట్టలుతెగి ప్రవహించింది. తమనింతవరకు అపారమైన కరుణారసంతో రక్షిస్తూవచ్చిన భగవానునికి మ్రొక్కి, ఆయన దీనజన వాత్సల్యాన్ని ఎంతో కొనియాడారు.

స్మిత్ సతి వారుముగ్గుర్ని ఒకక్రిష్టియన్ ఉపాధ్యాయుని ఇంటికి తీసికెళ్ళింది. అక్కడవారు కొంతకాలం బస చెయ్య

టానికి తగిన సమపాయం ఉంది. వారికి డబ్బులేదు, పనిలేదు, ఇల్లులేదు. ఈ విశాల ప్రపంచంలో వారిదని చెప్పుకోదగ్గ వస్తువేదీలేదు. అయితే వారికి గాలిలో ఎగిరేపక్షులకు, పొలాల్లో ఉన్నపువ్వులకు ఉన్న స్వేచ్ఛ, స్వాతంత్ర్యం ఉన్నాయి. వారికి కావలసింది అదే. ఆరాత్రి వారందరూ సుఖనిద్ర పోయారు.

# 21

తన మరణ సమయం ఆసన్నమైందనీ, త్వరలో భగవత్సాన్నిధ్యాన్ని చేరుకుంటానని అంకుల్ టాం అనుకున్నాడు. అయితే అతడు చావలేదు. ఆరోగ్యం చేకూరింది. మళ్ళీ తిరిగి పనిచేయటానికి పంపబడ్డాడు. లెగ్రీ అతణ్ణి క్రూరంగా చూడటం మొదలుపెట్టాడు. టాం పనంతా అయిపోయిన తరువాత కుంపటివెలుగులో బైబిలు చదవటానికి ప్రయత్నించేవాడు. కాని తలనొప్పి, కళ్ళనొప్పి బాధించేవి. అంచేత చదవలేకపోయేవాడు.

ఒకనాటి సాయంకాలం టాం బైబిలు చదవటానికి ప్రయత్నిస్తూ కూర్చున్నాడు. అంతలోనే లెగ్రీవచ్చి ఆ నిరుపయోగకరమైన ఆ పుస్తకాన్ని నిప్పులో పారెయ్యమన్నాడు. తాను మరణించేవరకూగూడా భగవంతుడిలో విశ్వాసం వుంచుతానన్నాడు టాం. ఒక్కతన్నుతన్ని లెగ్రీ వెళ్ళిపోయాడు. టాంకు నూతన ఉత్సాహం, ధైర్యం వచ్చింది.

అతనికళ్ళముందర ముళ్ళకిరీటాన్నిధరించిన ఏసుక్రీస్తు ప్రత్యక్ష మయ్యాడు. అప్పుడు టాం తన మోకాళ్ళమీదపడి ప్రార్ధన చేశాడు. ఆనాటినుంచి అతను ప్రశాంత జీవితాన్ని గడుప జొచ్చాడు. అతన్ని ఈ ప్రపంచంలో బాధించేదీ లేదు. అతనికి భగవత్సాన్నిధ్యం త్వరలో లభ్యమవుతుందని నమ్మకం గలిగింది.

ఒకనాటి రాత్రి టాం ప్రార్థనా పద్యాలు చదువుతుండగా, లెగ్రీవిని కొరడా పైకెత్తి ఆపుచేసేయమన్నాడు. టాం అక్కడనుంచీ వెళ్ళిపోబోయేసరికి కొరడాతో కొట్టాడు. టాం ఏమీ అనలేదు. తన దెబ్బలు టాం శరీరానికే కాని, ఆత్మకు తగులలేదని లెగ్రీ గ్రహించాడు. అతనికి, టాంమీద అధికారం తప్పిపోయింది. టాంయొక్క మంచితనం, ఇతరులపట్ల ప్రేమ, అతన్ని అందరికీ సన్నిహితుణ్ణి చేశాయి. అందఱూ అతని దగ్గరకువచ్చి ఏసుక్రీస్తు కథలు వినేవారు.

ఒకనాటిరాత్రి టాంకు మెళుకువ వచ్చేటప్పటికి బయట కేసీ నిలబడిఉంది. కళ్ళల్లో క్రూరత్వం స్పష్టంగా కనబడు లోంది. లెగ్రీకి తాను బ్రాంది నిచ్చాననీ, ఇంతలో లేవడనీ అంచేత తప్పించుకు పోవలసిందని ఆమె టాంను కోరింది. "లెగ్రీ గది తలుపు తెఱచేవుంది. గొడ్డలి సిద్ధంగావుంది. అతణ్ణి చంపటానికి నాకు శక్తిచాలదు. నువ్వుగూడా వచ్చిసహాయం చెయ్యి" అనిగూడా కోరింది. కాని మంచి అనేది దుర్మార్గం వల్లరాదనీ అంచేత తను ఆ పని చెయ్యనని టాం అన్నాడు. తనే లెగ్రీని చంపాలని కేసీ పోబోయేసరికి టాం ఆపుచేశాడు.

"మనం మనశ్రతువులనుగూడా ప్రేమించాలని దేవుడిఉద్దేశ్యం. అదే మన విజయం" అని బోధించాడు టాం. టాం మంచితనం ఆమెలో అపూర్వమైన మార్పుని తెచ్చింది. "నువ్వూ, ఎమెలిన్ పారిపోండి. భగవంతుడు మిమ్మల్ని రక్షిస్తాడు" అన్నాడు టాం. అప్పుడే తప్పించుకునే ఉపాయం తట్టింది కేసికి. అది ఆమెకు ఆశాజ్యోతి. టాం ఆమెను ఆశీర్వదించి పంపేశాడు.

# 22

లెగ్రీకుండే పిచ్చి నమ్మకాన్ని ఆధారంచేసుకొని తప్పించుకు పోవాలనుకుంది కేసీ. అతని పాతయింటిపైన ఒక అటుక గదిఉంది. చాలాసంవత్సరాలక్రితం అందులో ఒక నీగ్రో స్త్రీని బంధించాడు లెగ్రీ. ఆమె అందులో చచ్చిపోయింది. తరువాత అందులోంచీ వింత వింత కేకలు, చప్పుళ్ళు వినబడసాగాయి సేవకులకు. వారు వాటిని గూర్చి చెప్పుకుంటుండేవారు. లెగ్రీకి కోపంవచ్చి అలా యెవరన్నా మాట్లాడితే అందులో పెట్టి బంధిస్తానని బెదిరించేవాడు. ఆ గొడవ కొన్నాళ్ళకు చల్లబడింది.

కేసీ పడకగది దానిక్రిందే ఉంది. ఒకనాడు ఆమె తన సామాను నంతనీ ఆ గదిలోంచీ ఇంకోగదిలోకి మార్చేసింది. రాత్రుళ్ళుపైన ఉన్న అటుకగదిలోంచీ కేకలు వినబడుతున్నాయి. కాబట్టి అల్లా చేశానని కేసీ, లెగ్రీకి చెప్పింది. లెగ్రీ కోపంతో ఆమెను కొట్టబోయాడు. కేసీ పారిపోతూ "నువ్వా గదిలో పడుకునిచూడు. సంగతంతా నీకు తెలుస్తుంది" అంది.

తరువాత కేసీ ఆ అటుకగది గోడలో, ఒక కన్నంలో పగిలిపోయిన సీసా మూతి పెట్టింది. గాలివచ్చినప్పుడల్లా అందు లోంచి ఒక వింతయిన చప్పుడు వినబడుతోంది. సేవకులు అది విని అటుకగదిలో దెయ్యాలున్నాయనడం మొదలుపెట్టారు. ఆ వార్త అంతటా వ్యాపించింది. చివరకు అక్కడకు వెళ్ళటానికి లెగ్రీకే భయం వేసింది. ఈ లోపల కేసి తనకూ ఎమెలిన్‌కూ అటుకగదిలో ఆహార పదార్థాలూ, బట్టలూ, నీళ్ళ కొవ్వొత్తులూ దాచేసింది.

లెగ్రీ ఒకనాడు బయట కెక్కడికో వెళ్తున్నాడు. కేసీ, ఎమెలిన్ మూటలు పట్టుకొనిపారిపోతున్నట్లు నటించారు. అది లెగ్రీచూచి వాళ్ళను పట్టుకోవలసిందని క్వింబో, సాంబోలను, కుక్కలదు పంపాడు. కేసీ, ఎమెలిన్ వెళ్ళినట్లేవెళ్ళి ఎవరు చూడకుండా తిరిగి యింట్లో ప్రవేశించారు. కేసీ, లెగ్రీ తాళం చెవుల సహాయాన్న కొన్ని డాలరునోట్లు సంగ్రహించింది. తరువాత వాళ్ళిద్దరూ అటకగదిలో దాక్కున్నారు. దాని గోడ కన్నాల్లోనుండి తమర్ని పట్టుకోటానికి లెగ్రీచేస్తున్న సన్నాహాల్ని చూసింది కేసీ. లెగ్రీ కొన్ని రోజులవరకూ వారి కోసం వెదికాడు. కాని ఏమీా లాభం లేకపోయింది.

చివరకు వారు పారిపోయిన వివరాలు టాంకు ఏమన్నా తెలుసునేమో అడుగుదా మనుకున్నాడు లెగ్రీ. సాంబో, క్వింబోలు టాంను లెగ్రీ ముందరికి ఈడ్చుకొచ్చారు. కేసీ, ఎమెలిన్‌లు ఎక్కడ దాక్కున్నారో టాంకు తెలుసు. అయినా దాన్నిగూర్చి ఒక్కమాటగూడా మాట్లాడలేదు. చంపుతానని

బెదిరించినా టాం ఏమీ చెప్పలేదు. లెగ్రీకోపం హెచ్చిపో యింది. "నీలో ప్రతి రక్తపు చుక్కనీ ఓడుస్తాను. జాగ్రత్త" అన్నాడు అతడు. "నువ్వు చంపు నన్ను, అంతటితో నాకష్టా లన్నీ తీరిపోతాయి" అన్నాడు టాం. లెగ్రీకి కోపంవచ్చి టాం నేలమీద పడేటట్లు కొట్టాడు.

ఆ రాత్రి టాం ఎంత బాధపడ్డాడో వర్ణించటానికి వీల్లేదు. అయినా అతని నోటమ్మట దైవప్రార్థన తప్ప వేరు మాట లేదు. టాం యొక్క స్థితిని చూచేటప్పటికి కఠినుడైన సాంబో హృదయం గూడా కరిగింది. టాం అటువంటి స్థితిలో గూడా, అందర్నీ క్షమించానని చెప్పి స్పృహ తప్పిపడిపో యాడు. లెగ్రీ ఆ ప్రదేశం విడిచి వెళ్ళిపోయాడు. సాంబో క్వింబోలిద్దరూ టాంకు వుపచారాలు చేసారు. అతని గాయా లన్నీ కడిగి కట్లుకట్టారు. టాంకు తెలివి వచ్చింది. ఏసుక్రీస్తు ఎటువంటి బాధలను అనుభవించింది, అయినా అతడు మానవ జాతిని ఎంతగా ప్రేమించిందీ టాం వారికి బోధించాడు. వారిరువురుగూడా దయామయుడైన భగవంతుణ్ణి ప్రార్థన చేసారు.

## 23

సెంట్ క్లేర్ మరణించిన తరువాత ఒఫేలియా కన్య టాంను గూర్చి షెల్బీసతికి ఓ ఉత్తరం వ్రాసింది. ఆ ఉత్తరం

షెల్బీసతికి కొంత ఆలస్యంగా చేరింది. అప్పటికి షెల్బీ చాలా జబ్బులోనున్నాడు. కొన్నాళ్ళయిన తరువాత అతడు మరణించాడు. కొన్నాళ్ళయిన తరువాత షెల్బీ కుమారుడు జార్జిషెల్బీ పనిమీద దక్షిణాదికి వెళ్ళాడు. టాంను కొనెయ్యటానికి తగినంత డబ్బు తీసికెళ్ళి, టాంనుగూర్చి ఆరాలు తీసాడు. చివరికి అతడెక్కడ ఉన్నదీ కనుక్కోగలిగాడు. లెగ్రీ టాంను క్రూరంగా హింసించిన రెండు రోజులకు జార్జిషెల్బీ అక్కడకు వచ్చాడు.

జార్జిషెల్బీ, టాంనుగూర్చి అడిగేటప్పటికి లెగ్రీకి చాలా కోపంవచ్చింది. తరువాత జార్జి షెల్బీ, టాంపడుకున్న చోటికి వచ్చాడు. టాం ప్రక్కనే చతికిలబడ్డాడు. టాం ప్రాణంపోయే స్థితిలోఉంది. టాం, జార్జిషెల్బీని గుర్తించాడు. తన యజమాని తన్ని మర్చిపోలేదని ఎంతో ఆనందించాడు. సంతృప్తితో చచ్చిపోతానన్నాడు. టాంని కొనేసి యింటికి తీసుకుపోతానన్నాడు జార్జిషెల్బీ. కాని అప్పటికి చాలా ఆలస్యమైపోయిందనీ, తాను అన్నింటికంటె మంచిదైన గృహానికి వెళ్తున్నానని అన్నాడు. తనకు విజయం లభించిందనీ, భగవత్సాన్నిధ్యంగూడా లభించబోతుందనీ అన్నాడు. షెల్బీ కుటుంబంలో వారిఅందర్ని పేరుపేరునా అడిగాడు టాం. ప్రేమమూర్తియైన టాం మరణించాడు.

చచ్చిపోయిన టాంను గూడా డబ్బిచ్చి తీసికెళ్ళాలా అని జార్జి షెల్బీ, లెగ్రీని అడిగాడు. చచ్చిన బానిసల్ని అమ్మే

అలవాటు లేదన్నాడు లెగ్రీ. టాం శరీరాన్ని బయటపెట్టించి తనకోటు కప్పాడు జార్జిషెల్బీ. తరువాత తనబండిమీాద పెట్టించాడు. టాంను లెగ్రీ హత్యచేసినట్లు కేసు పెడతానన్నాడు జార్జిషెల్బీ. కాని అదేమీా లాభంలేదు. ఎంచేతంటే చట్టం రంగుజాతివాళ్ళ సాక్ష్యాన్ని అంగీకరించదు. చచ్చిన బానిసను గూర్చి పెద్దగా గొడవ చెయ్యటం ఏమీా బాగుండలేదన్నాడు లెగ్రీ. జార్జిషెల్బీకి కోపం వచ్చి ఒక్కదెబ్బతో లెగ్రీని నేల మీాద పడగొట్టాడు.

జార్జి ఒక చిన్న పచ్చని కొండదగ్గర టాం భౌతిక శరీరాన్ని పూడ్పించాడు. అప్పుడాతడు మోకరిల్లి దేశంలో బానిసత్వాన్ని రద్దు చేయించే శక్తిని తనకు ప్రసాదింపవలసిందని భగవంతుణ్ణి ప్రార్థించాడు.

## 24

టాం మరణించిన తరువాత ఒక తెల్లటి విగ్రహం రాత్రుల్లు తిరుగుతూందని సేవకులు అనటం ప్రారంభించారు. లెగ్రీ భయపడి, ఆ భయంతగ్గటానికి ఇంకా ఎక్కువ త్రాగటం మొదలుపెట్టాడు. కొన్నాళ్ళయిన తరువాత రాత్రుల్లు రెండు తెల్లవిగ్రహాలు కనబడటం మొదలు పెట్టాయి. అవి ఎవరో కాదు-కేసీ, ఎమెల్లినులు. పగలు వారు దుస్తులు మార్చేశారు.

కేసీ ఒక స్పానిష్ స్త్రీవేషం, ఎమెలిన్ సేవకురాలివేషం వేసుకున్నారు. వారు పట్టణంలోకి వెళ్ళి, ఓ సత్రంలోకి వెళ్ళి అక్కడ జార్జి షెల్బీని కలుసుకున్నారు. జార్జిషెల్బీ, కేసీ, ఎమెలిన్‌లు ఒకే పడవలో న్యూఆర్లియన్సుకు ప్రయాణం ప్రారంభించారు.

కేసీని ఇదివరకెప్పుడో చూసినట్లుంది జార్జి షెల్బీకి. వారున్నగదికి ప్రక్కనే ఒక ఫ్రెంచిస్త్రీ ఉంది. ఆమెతోకూడా పన్నెండేళ్ల కూతురుగూడాఉంది. ఆమె జార్జి షెల్బీ కెంటుకీని గూర్చి చెబుతుండగావింది. అంచేత హారిస్ దగ్గర బానిసగా ఉండే జార్జి తెలుసునా అని అడిగింది. అతడు కెనడాకు పారిపోయాడన్నాడు జార్జి షెల్బీ. ఫ్రెంచి స్త్రీ యిలాఅంది. "జార్జి నా సోదరుడు నేను ఒక మంచి పెద్దమనిషికి అమ్మబడ్డాను. ఆయననాకు స్వేచ్ఛనిచ్చి, నన్ను పెళ్ళిచేసుకొన్నాడు. ఆయన కొన్నాళ్ళక్రిందట చచ్చిపోయాడు. ఇప్పుడు నా సోదరుడు ఎక్కడున్నాడో తెలుసుకోవాలని ఉంది." అప్పుడు జార్జి షెల్బీ యిలా అన్నాడు. "జార్జి చాలా మంచివాడు. మా అమ్మచేత పెంపబడిన ఎలీజా అనే బానిసస్త్రీని పెండ్లాడాడు." "ఎలీజాను ఎవరిదగ్గరనుంచీ కొన్నారు ?" అని కేసీ అడిగింది. జార్జిషెల్బీ సిమ్మన్సు పేరు చెప్పేటప్పటికి కేసీ మూర్ఛపోయింది. ఆమెకు స్పృహ వచ్చిం తరువాత ఎలీజా తన కూతురేననీ, భగవంతుడు తన్ను కరుణించాడనీఅంది.

కేసీ, ఫ్రెంచి స్త్రీ కలసి జార్జి ఎలీజాలను వెదకటానికి నిశ్చయించుకున్నారు. వారిరువురూ కెనడా వెళ్ళి, జార్జి, ఎలీజా మాంట్రీలులో ఉన్నారని తెలుసుకున్నారు. జార్జి ఓ ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాడు. వారికి ఒక కూతురుగూడా పుట్టింది. జార్జి తనసోదరిని, ఎలీజా తనతల్లిని కలుసుకున్నారు. అందరూ దేవుణ్ణి ప్రార్థించారు. ఫ్రెంచిస్త్రీ చాలా ధనికురాలవటంచేత, తన డబ్బంతా కుటుంబ అభివృద్ధికి వినియోగించాలనుకుంది. జార్జి, అతని కుటుంబం, ఫ్రెంచీ స్త్రీ, కేసీలతోసహా ఆఫ్రికాకు వెళ్లారు. కెనడాకు వెళ్ళేముందర కేసీకొడుకు గూడా కనుక్కోబడ్డాడు. అతడుగూడా ఆఫ్రికా వెళ్ళిపోయాడు. ఎమెలిన్ ఒక ఆఫీసర్ని పెళ్ళిచేసుకొని, ఫ్రాన్సులో స్థిరపడింది.

## 25

తాను ఇంటికి తిరిగి వస్తున్నట్లుగా జార్జిషెల్బీ తల్లికి ఓ ఉత్తరం వ్రాశాడు. అందులో అతడు అంకుల్‌టాంనుగూర్చి యేమీ వ్రాయలేదు. ఆంట్ క్లో తన భర్త ఎప్పుడు తిరిగి వస్తాడాఅని చాలా ఆత్రుతతో ఉంది. టాంను గూర్చి తన కొడుకు ఏమీ వ్రాయనందుకు షెల్బీసతి ఆశ్చర్యపోయింది. ఆంట్ క్లో సంపాదించి నిలువచేసిన డబ్బుతో టాంను కొని

వెయ్యాలనుకుంది. ఆనాడామె ఆ డబ్బును టాం చూడటం కోసం ఓ బల్లమీద పరిచి ఉంచింది.

జార్జి షెల్బీ యింటికివచ్చి అంకుల్ టాం మరణం బయట పెట్టాడు. ఆంట్ క్లోకు గొప్ప ఆశాభంగం కలిగింది. ఆమె డబ్బంతా షెల్బీసతి కిచ్చేసి నడిచి వెళ్ళిపోయింది. షెల్బీసతి ఆమెను వెంబడించి పట్టుకుంది. ఆంట్ క్లో యజమానురాలి నానుకుని ఘోరంగా ఏడ్చింది. అప్పుడు జార్జి షెల్బీ, అక్కడకు వచ్చి అంకుల్ టాం అమరగాధను విశదీకరించాడు. "అంకుల్ టాం స్వార్ధరహితుఁడు; ప్రేమమూర్తి; అతడు ఏసుక్రీస్తు ప్రతినిధి; భగవంతునికి ప్రియమైనవాడు."

THE END

# తప్పక చదువతగినవి

| | | |
|---|---|---|
| అబల | (నవల) | 3-0-0 |
| సౌదామిని | (నవల) | 2-8-0 |
| కథానికలు | | 1-0-0 |
| డికెన్సు కథలు | మొదటి భాగం | 1-0-0 |
| ,, ,, | రెండవ భాగం | 1-8-0 |
| స్టీవెన్సను కథలు | మొదటి భాగం | 1-8-0 |
| డ్యూమా కథలు | ,, | 1-8-0 |
| స్కాటు కథలు | ,, | 1-8-0 |
| డాక్టర్ & అంకుల్ | | 1-0-0 |
| నీతికథాంజలి 7 భాగముల సెట్టు | | 3-8-0 |

## హిందీ పుస్తకములు

| | |
|---|---|
| హిందుస్తానీ తెలుగు శిక్షక్ | 0-4-0 |
| హిందుస్తానీ స్వయం శిక్షక్ | 1-8-0 |
| హిందుస్తానీ వ్యాకరణ సంగ్రహ్ | 1-0-0 |

|

# డాక్టర్ జెకిల్ ఎండ్ మిస్టర్ హైడ్

## 1. వింతగుమ్మం

అట్టర్సన్ ఒక ప్రసిద్ధి చెందిన లాయరు. అతను చాలా మితభాషి. చూడటానికి అంత సొంపుగా ఉండడు. కరుకైన ముఖం. ఎప్పుడూ మచ్చుకైనా మందహాస మనేది ఉండదు. అయినా ప్రజలు అతనిని ఎప్పుడూ ప్రేమిస్తూనే ఉండేవారు. దీనికి కారణం అతను ఎప్పుడూ వారిని దయతో చూస్తుండేవాడు. చాలామంది తమ దయను మాటల్లో చూపెడతారు. కాని అతను తన దయను చేతల్లో చూపెట్టే వాడు. జీవితంలో పెద్దగా ఐహికసుఖాల్ని అనుభవించాలనే కోరిక అతనికి లేదు. కాని ఇతరులు ఆ సుఖాల్ని అనుభవి స్తూంటే చూసి అమితంగా ఆనందపడేవాడు. అమితమైన ఆనందాల్లో మునిగి తేలుతూ, కష్టాలలో కొట్టుకుపోయేవారికి గూడా తన చేతనైనకొలది సహాయపడుతుండేవాడు. వారు ఎటువంటి స్థితిలోకి వెళ్ళినా వారంటే తనకున్న అభిప్రాయా న్నేమీ మార్చుకునేవాడు కాదు.. అతని ప్రకృతి అది.

అట్టర్సన్‌కు అనేకరకాల స్నేహితులుండేవారు. అను కోకుండా తనకు తారసిల్లే వారితో గూడా స్నేహం చేసేవాడు. అతని స్నేహితుల్లో కొంతమంది కుటుంబములోనివారు. కొంతమంది చాలాకాలంనుంచి ఎఱిగున్నవారు. స్నేహితులు

మంచివారా చెడ్డవారా అనే విచక్షణలేకుండానే అతడు అందర్నీ ప్రేమించేవాడు. అతడు తనకు దూరపు బంధువైన రిచర్డు ఎన్‌ఫీల్డుతో చాలా స్నేహంగా ఉండేవాడు. వారి ఇద్దరి ప్రకృతులూ విభిన్నమైనవి. అంచేత ప్రజలు వారి గాఢ స్నేహాన్ని చూచి ఆశ్చర్యపడేవారు. వారిద్దరూ కలసి ప్రతి ఆదివారం సాయంకాలం షికారుకి వెళ్తుండేవారు. ఇద్దరూ కలసి నడుస్తూ వెళ్తుండేవారే కాని ఒకరితో ఒకరు మాట్లాడుకునేవారు కారు.

ఒక ఆదివారం నాటి సాయంకాలం ఇద్దరు స్నేహితులూ కలసి లండన్‌లో రద్దీగానుండే భాగంలోని ఒక సందుగుండా వెళ్తున్నారు. ఆదివారం అవటంచేత సందు కొంచెం ప్రశాంతంగానే ఉంది. వీధి చాలా పరిశుభ్రంగా ఉంది. ఇళ్లుగూడా చూడటానికి బాగానే ఉన్నాయి — క్రొత్తగా రంగువేసిన తలుపులు మున్నగువాటితో.

ఆ సందుకి ఒకమూల రెండు అంతస్థులమేడ ఉంది. దానికి కిటికీలేమీ లేవు. చూడటానికి చాలా పాతదిగా ఉంది. రంగువేసికాని, బాగుచేసిగాని చాలా కాలమయినట్లుంది. గోడలన్నీ అందవికారంగా ఉన్నాయి. పిల్లలు మెట్లమీద ఆడుకుంటున్నారు. ఇళ్లులేనివారు అరుగులమీద తిష్ఠవేసుకొని కూర్చున్నారు. వాళ్ళని వెళ్లగొట్టటానికి ఇంటివారు ఏమీ ప్రయత్నిస్తున్నట్లు లేదు. స్నేహితులిద్దరూ ఆ ఇంటిదగ్గరకు రాగానే, ఎన్‌ఫీల్డు ఆ ఇంటికేసి తనచేతి కఱ్ఱెత్తి చూపుతూ "ఆ ఇంటిగుమ్మం చూసారా? దానికి సంబంధించిన ఒక వింత

కథ ఉంది'' అని అట్టర్సన్‌తో అన్నాడు. "అలాగా? ఏమి టది?'' అన్నాడు అట్టర్సన్. ఎన్‌ఫీల్డు ఆ కథను ఇలా చెప్ప టం ప్రారంభించాడు.

"అది శీతాకాలం. ఒకనాటి ప్రొద్దున్నే మూడు గంట లకు ఈ వీధిగుండా నేను ఇంటికి వెళ్తున్నాను. వీధులన్నీ ప్రశాంతంగా, నిర్మానుష్యంగాఉన్నాయి. వీధి దీపాలుమాత్రం వెలుగు తున్నాయి. ఒక పోలీసువాడైనా కనబడితే బావుణ్ణను కుంటూ నడుస్తున్నాను. హఠాత్తుగా ఇద్దరు మనుష్యులు కనుపించారు - తూర్పుదిక్కుగా గబగబానడుస్తున్న ఒక పొట్టి మనిషి; ఒక అడ్డు సందుగుండా గబగబా పరుగెత్తుకుంటూ వస్తున్న ఒక ఎనిమిది లేక పది ఏళ్లుండే అమ్మాయి. ఇద్దరూ ఒకరినొకరు ఢీకొన్నారు. అమ్మాయి క్రిందపడి ఏడ్వటం మొదలు పెట్టింది. కాని, ఆశ్చర్యం ఏమిటంటే, ఆ పొట్టిమనిషి ఆగకుండా ఆ అమ్మాయిని త్రొక్కుకుంటూ ముందుకు పోసాగాడు. ఆదృశ్యం చూడటానికి ఎంతో భయానకంగా ఉంది. వాడు మనిషికాడు, భూతం, దెయ్యం, రాక్షసుడు అనుకున్నాను. వెంటనే పరుగెత్తికెళ్ళి వాణ్ణి పట్టుకొని వెనక్కు ఈడ్చుకొని వచ్చాను. ఈ లోపల, అప్పటికప్పుడే, ఏడుస్తూన్న అమ్మాయి చుట్టూ చాలామంది జనం గుమిగూడారు. ఆ పొట్టి మనిషి చాలా ప్రశాంతంగా ఉన్నాడు. నన్ను ఏమీ నిరోధించ లేదు. కాని నాకేసి ఒక్క చూపు చూశాడు. దాంతో నాకు వళ్ళంతా చెమటపట్టింది. ఇంతట్లోకే అక్కడకు ఒక డాక్టరు గూడా వచ్చాడు. అతడు ఆ అమ్మాయిని పరీక్షించి, 'గాయ

మేమీ ఎక్కువగా తగల్లేదు. బాగా భయపడింది' అన్నాడు. చుట్టుపక్కల ఉన్నవారంతా ఆ పొట్టి మనిషిమీద తెగ కేకలేస్తున్నారు. ఆడవాళ్లు అతన్ని తెగ బాదటానికిగూడా ఉద్యుక్తులయ్యారు. అతని రాక్షసవాలకం, వికృతస్వరూపం చూసి అందరూ కోపోద్రిక్తులయ్యారు. కాని ఆ పొట్టివాడు మాత్రం ఏమీ చలించకుండా ఇల్లా అన్నాడు. 'నన్ను అల్లరి పెట్టాలని ఉంటే అల్లరి పెట్టండి. అందుకు నేనేమీ చేయలేను. నిస్సహాయస్థితిలో ఉన్నాను. అయితే మీరేమీ గొడవ చేయకుండా ఉంటానికి, మీ కెంత డబ్బుకావాలి?' నూరు పౌనులివ్వవలసిందని మేమందరం అడిగాము. ఆ పొట్టి మనిషి అంతకంటె తక్కువ ఇద్దామని ప్రయత్నించాడు గాని చివరకు నూరుపౌనులూ ఇవ్వటానికి ఒప్పుకున్నాడు.

అతని జేబులో డబ్బేమీ లేదు. అంచేత మమ్మల్ని ఆ యింటిద్వారం దగ్గరకు తీసికెళ్లాడు. జేబులోంచి తాళంచెవి తీసి, తలుపులు తెరచి, లోపలికి వెళ్లాడు. వెంటనే తిరిగి వచ్చాడు. పది పౌనులు బంగారు నాణాల రూపంలోను, తొంభై పౌనులు చెక్కురూపంలోను ఇచ్చాడు. ఆ చెక్కు మీద ఒక విఖ్యాత పురుషుని సంతకం ఉంది. ఆపేరు నాకథకు చాలా ముఖ్యమైనా నేను చెప్పను. ఆ సంతకం నిజంగా ఆ మనిషిదే ఐతే, ఆ చెక్కును సందేహించవలసిన అవసరంలేదు. కాని నాకు ఆ విషయమంతా వింతగాతోచింది. ఇంకొకరి పేరుతోనున్న తొంభై రూపాయిల చెక్కును సులభంగా తీసి కొని రావటమనే విషయం, వాస్తవిక ప్రపంచంలో సాధార

ణంగా జరిగే సంగతి కాదని ఆ పొట్టిమనిషితో చెప్పాను. 'అయితే బ్యాంకులు తెరచేదాకా నేను మీదగ్గరేఉండి, చెక్కుమార్చి మరీ వెళ్తాను' అన్నాడు అతడు. సరే, ఆ రాత్రికి అతడు, డాక్టరు, అమ్మాయి తండ్రి, నేను మా యింట్లోనే కాలంగడిపాం.

తెల్లవారిం తరువాత అందరమూ బ్యాంకుకు వెళ్లాం. చెక్కును లోపలికి అందిస్తూ, చెక్కు సందేహాస్పదంగా ఉందని అధికారితో అన్నాను. 'ఏమీ లేదు. అంతా సరిగ్గానే ఉంది'. అన్నాడు అధికారి. చెక్కు మారింది.

పొట్టిమనిషి స్నేహపాత్రుడు కాదు. చెక్కుపై సంతకం చేసిన మనిషి చాలా గౌరవనీయుడు, మంచి పేరు పొందిన వాడు. అటువంటి, వారిద్దరకూ స్నేహమెట్లా కలిసిందా అని పించింది. బహుశా ఆ పెద్దమనిషి చిన్నప్పుడు సుఖాలనుభ వించటానికి కొన్ని అవినీతి కార్యాల్లోకి దిగియుండవచ్చును. అది తెలిసిన ఆ పొట్టిమనిషి, వాటిని బయటపెడ్తానంటూ డబ్బును గుంజుతూ ఉండవచ్చును. అయితే ఇందులో ఇంత కంటే నిగూఢమైన విషయమేదో, ఉందనిపించింది."

అంతటితో ఎన్‌ఫీల్డు ఆలోచనాపరుడయ్యాడు. అంతలో అట్టర్సన్ ఇల్లా అడిగాడు, "చెక్కు వ్రాసి యిచ్చిన మనిషి అక్కడ నివసిస్తున్నాడా?"

"అతని అడ్రసు నాకు తెలుసును. వేరొకచోట ఎక్కడో ఉంటున్నాడు" అని జవాబిచ్చాడు ఎన్‌ఫీల్డు.

తరువాత ఎన్‌ఫీల్డు ఇంకా యీ విధంగా అన్నాడు, "నేనా యింటిని బాగా పరిశీలించాను. ఆయింటికంతకూ ఒకటే ద్వారం ఉంది. ఆపొట్టిమనిషి తప్ప, ఆయింట్లోకి వెళ్లేవారు, ఆయింట్లోంచి బయటకు వచ్చేవారు వేరెవరూ లేరు. క్రిందిభాగానికి కిటికీలు లేవు. మొదటి అంతస్తులో మూడు కిటికీలున్నాయి కాని ఎప్పుడూ మూసే ఉంటాయి. అయినా పరిశుభ్రంగా ఉంటాయి. అప్పుడప్పుడు పొగగొట్టంలోంచి పొగవస్తూంటుంది. కనుక అందులో తప్ప కుండా ఎవరో ఒకరు నివసిస్తూ ఉండియుండాలి. అయితే ఆ పొగగొట్టం ఏ యింటికి సంబంధించిందో స్పష్టంగా తెలియటం లేదు."

"ఆఁ, అయితే ఆ అమ్మాయి మీదుగా నడచిపోయిన మనిషి పేరేమిటి?" అని అడిగాడు అట్టర్సన్.

"అతనిపేరు హైడ్."

"ఎల్లా ఉంటాడు?"

"వర్ణించటానికి సాధ్యపడదు. అతనిలో ఏదో ఒక లోటుంది. చూడటానికి అసహ్యంగా ఉంటుంది. అంతా వికృతాకారం. ఎక్కడో అవయవలోపమున్నట్లు తోస్తుంది గాని – ఎక్కడోమాత్రం స్పష్టంకాదు. అతనంటే నాకెందుకు అంత అసహ్యమో అర్థం కావటంలేదు. అంతా అసాధారణ మైన మనిషి."

"అయితే అతడు తలుపులు తెరవటానికి తాళంచెవి ఉపయోగించినమాట నిశ్చయమేనా?"

"అయ్యో దేవుడా………"

"సరిసరి, నేను చెక్కుపై సంతకం చేసినమనిషిపేరు అడగటంలేదు. అదినాకు హైడ్ పేరు చెప్పగానే తెలిసింది. కథంతా అర్థమయింది."

"అతడు తాళంచెవి ఉపయోగించినమాట నిశ్చయం. అది ఇంకా యిప్పటికీ అతనిదగ్గర ఉంది. ఎంచేతంటే దాన్ని అతడు వారం రోజులక్రితం ఉపయోగిస్తుండగా చూశాను. అయితే ఈ విషయాన్ని గూర్చి ఇకముందు మనం ప్రస్తావించ కూడదు సుమా."

"నిశ్చయంగా అంతే."

---

# 2. హైడ్‌తో సమావేశం

ఆసాయింత్రం ఆందోళనతోకూడిన మనస్సుతో అటర్సన్, ఇంటికి వెళ్ళాడు. అతడు ప్రతి ఆదివారం అర్ధరాత్రి వరకు మతగ్రంథాలు చదివి, తరువాత సుఖనిద్రపోయేవాడు. కాని ఆనాడు భోంచేసింతరువాత, కొవ్వొత్తి ఒకటి చేత బుచ్చుకొని తన ఆఫీసు గదిలోకి వెళ్ళాడు. ఇనప్పెట్టె తలుపు తెరచి, లోపల్నుంచి ఒక పెద్దకవరు బయటకు తీసాడు. దాని మీద 'డాక్టర్ జెకిల్ వీలునామా' అని వ్రాసి ఉంది. అటర్సన్ కూర్చుని లోపలి వీలునామా చదవటం ప్రారం

భించాడు. వీలునామా డాక్టరు జెకిల్ స్వహస్తంతో వ్రాయబడి యుంది. ఆ వీలునామాలో ముఖ్యమైన అంశం యీ విధంగా ఉంది.

"డాక్టర్ హెన్రీ జెకిల్ అనే నేను చనిపోయేటట్లయితే నా ఆస్తి అంతా నాకు మిత్రుడు, సహాయుడు అయిన ఎడ్వర్డు హైడ్‌కు చెందవలెను. అంతేకాదు. నేను హఠాత్తుగా అదృశ్యమయినా, ఏవిధమైన కబురూ లేకుండా మూడు నెలలు దాటి యింటికి రాకుండా ఉన్నా, ఏమాత్రం ఆలస్యం చేయకుండా ఎడ్వర్డుహైడ్ నా ఆస్తి నంతటినీ స్వాధీన పరచుకొనవలెను."

ఈ వీలునామా అట్టర్సన్‌కు లాయరుగాను, మామూలు వ్యక్తిగాను కష్టాన్ని కలిగించింది. హైడ్‌ను గూర్చి ఎరక్కపూర్వం, అతనికి కోపంగా ఉండేది. ఇప్పుడది అతిశయించింది. ఇంతవరకూ జెకిల్ పిచ్చిగా వీలునామా వ్రాశాడని అనుకునేవాడు. ఇప్పుడు హైడ్‌తో సంబంధం పెట్టుకోటం సిగ్గుచేటైన వ్యవహారమని అనుకుంటున్నాడు. వెంటనే కొవ్వొత్తి ఆర్పేసి, జెకిల్‌నుగూర్చి ఇంకా ఎక్కువ వివరాలు తెలుసుకునేందుకు తమ ఇరువురకూ ముఖ్యస్నేహితుడైన డాక్టరు లేన్యన్ ఇంటికి బయలుదేరి వెళ్లాడు. డాక్టర్ లేన్యన్ ఎప్పుడూ కలకలలాడే ఎఱ్ఱని ముఖంతో ఆనందదాయకంగా కాలం గడిపే మంచి ఆరోగ్యం గల వ్యక్తి. అతనిలో ఎప్పుడూ జీవం ఉట్టిపడుతూ ఉంటుంది. లోపలికి అట్టర్సన్ వెళ్లగానే, డాక్టర్ లేన్యన్ కుర్చీమీద

నుంచీ లేచి రెండుచేతుల్తోను. స్నేహితుణ్ణి సాదరంగా ఆహ్వానించాడు. ఇద్దరూ స్కూల్లోను, కాలేజీలోను కలిసి చదివారు. పరస్పర గౌరవం ఉంది. ఇద్దరికీ కలిసి మాట్లాడుకోటమంటె బాగా యిష్టం. ఇద్దరూ కలసి కొంచెంసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్న తరువాత, అట్టర్సన్ అసలు కథకు వచ్చాడు. డాక్టర్ జెకిల్ ప్రస్తావన తెచ్చాడు. "అతని మనస్తత్వంవేరు. నా మనస్తత్వం వేరు. పది సంవత్సరాల నుండీ అతని ప్రవర్తన మరీ వింతగా ఉంటున్నది. అతని కేదో మానసిక లోపమేర్పడిందని నా అభిప్రాయం. అతనంటే అభిమానమున్నా, నేను అతన్ని కలిసికోటమే లేదు. అతని వికృత శాస్త్రసంబంధమైన అభిప్రాయాలు ఎటువంటి గాఢ స్నేహితుల్నయినా వేరు చేయగలవు" అని డాక్టరు లేన్యన్ తనకోపాన్ని వెలిబుచ్చాడు. ఇది అట్టర్సన్‌కు కొంచెం ఉపశాంతిని కలిగించింది. లేన్యన్ శాంతించిన తరువాత అట్టర్సన్ యీ విధంగా ప్రశ్నించాడు, "జెకిల్ స్నేహితుడైన హైడ్‌ను ఎప్పుడైనా చూచావా?"

"హైడ్! నేనెప్పుడూ పేరైనా వినలేదే!"

సరే, ఇంక లేన్యన్‌నుండి తెలిసికోవలసిందేమీ లేదని అట్టర్సన్ ఇంటికి వెళ్లిపోయాడు. ఆరాత్రి అతనికి నిద్రలేదు. ఎన్‌ఫీల్డు, హైడ్‌నుగూర్చి చెప్పిన కథ అతన్ని వేధించటం మొదలు పెట్టింది.

ఆనాటినుంచీ హైడ్‌నుగూర్చి వివరాలు తెలిసికోవాలని హైడ్‌నుచూడాలని కుతూహలం ఎక్కువైంది అట్టర్సన్‌కు.

వింత గృహద్వారాన్ని కనిపెట్టుకుని ఉంటుండేవాడు. ఎప్పుడు చూచినా అక్కడ ప్రత్యక్షమే.

చివరకు అతని శ్రమ ఫలించింది. ఒకనాటి రాత్రి పదిగంటలకు అట్టర్సన్, ఆయింటిని కనిపెట్టుకొని ఉన్నాడు. అంతా ప్రశాంతంగా ఉంది. అట్టర్సన్‌కు వింతయైన అడుగు చప్పుళ్ళు వినిపించాయి. అవి క్రమ క్రమంగా దగ్గరకు రాసాగాయి. అట్టర్సన్ పక్కకు తప్పుకు చూసాడు. సాధారణ దుస్తులు ధరించిన ఒక పొట్టి మనిషి కనిపించాడు. అతన్ని చూడగానే అట్టర్సన్‌కు అసహ్యాభావం కలిగింది. ఆ పొట్టి మనిషి ద్వారం దగ్గరకు వెళ్ళి జేబులోంచి తాళంచెవి తీసాడు.

వెనువెంటనే అట్టర్సన్ వెళ్ళి పొట్టిమనిషి భుజంమీద చేయివేసి "హైడ్ అనుకుంటాను?" అన్నాడు. పొట్టిమనిషి ఒక్క క్షణం భయపడ్డట్టు కనిపించాడు. కాని వెంటనే ప్రశాంతతను తెచ్చిపెట్టుకొన్నాడు. లాయరు ముఖంకేసి చూడకుండానే "అది నా పేరే. ఏంకావాలి?" అన్నాడు.

"ఆఁ, ఏమీలేదు మీరు లోపలకు వెళ్తున్నారుకదూ- నేను డాక్టరు జెకిల్ పాత స్నేహితుణ్ణిలెండి. అట్టర్సన్ అంటారు నన్ను. నా పేరు మీరు వినేయుంటారు. జెకిల్‌ను చూడాలి. లోపలికి పోనిస్తారా?"

"డాక్టర్ జెకిల్ ఇంట్లోలేడు. అది సరే, నన్నుమీరు ఎట్లా ఎరుగుదురు?"

"మీరు ఒక్క సహాయం చేసిపెడతారా?"

"సంతోషంగా. ఏమిటది?"

"ఒక్కసారి మీముఖాన్ని చూడనిస్తారా?"

హైడ్‌కు ఇష్టంలేనట్లు కన్పించింది. కాని ఆ అభిప్రాయాన్ని మార్చుకొని, ఇతరులేమనుకున్నా ఫరవాలేదులే అనే ధోరణిలో ముఖం ఎత్తాడు. ఇద్దరూ ఒకరొకరు తేరపార చూసుకొన్నారు.

"మళ్లీ కలుసుకొంటాను" అన్నాడు అట్టర్సన్. "సరే, మనం కలుసుకున్నందుకు చాలా సంతోషంగా ఉంది. నా అడ్రసు మీదగ్గర ఉంటే మంచిది" అంటూ హైడ్, సోహోలో ఒక వీధి నంబరు ఇచ్చాడు.

"సరీ, హైడ్‌గూడా జెకిల్ వీలునామాను గూర్చి ఆలోచిస్తున్నాడన్న మాట" అని తనలో తను అనుకున్నాడు అట్టర్సన్.

"మఱి, నన్ను ఎట్లా తెలిసికొన్నారు?" అన్నాడు హైడ్.

"నిన్ను వర్ణిస్తూ ఒకరు చెప్పారు."

"ఎవరు?"

"మన యిరువురికీ స్నేహితుడైన ఒకరు."

"ఎవరాతడు?"

"జెకిల్"

(కోపంతో) "జెకిల్! ఎన్నటికీకాదు, పచ్చి అబద్ధాలు"

"కొంచెం శాంతించండి."

హైడ్ సకిలింపులాగ ఇకిలించాడు, వెంటనే తలుపు తీసి లోపలికి అదృశ్యుడయ్యాడు.

అట్టర్సన్ ఆలోచిస్తూ అక్కణ్ణించీ దారిపట్టాడు. హైడ్‌నుగూర్చే అతని ఆలోచన. అది ఒక కఠిన సమస్య. హైడ్ అస్వాభావికంగా పొట్టిగా ఉన్నాడు. ఎక్కడో అవయవ లోపం ఉన్నవాడిలా ఉన్నాడు. వికృతమైన నవ్వు, హీనస్వరం. కాని ఇంతమాత్రంచేత అతనంటే ఎందుకు భయపడాలో, అతన్ని ఎందుకు ద్వేషించాలో లాయరుకు అర్ధమవలేదు. తనలో తను ఇట్లు అనుకున్నాడు. "ఏదో నిగూఢమైన విషయం ఉంది. అతడు మనిషిలాగే లేడు. అతడొక పిశాచము, అయ్యో, జెకిల్, ఎంతటి దుస్థితిలో నున్నావు? నీస్నేహితుడు రాక్షస స్వరూపము సుమా! నీకెంత గతి పట్టినది!"

త్రోవలో ఒక ఇంటిదగ్గర ఆగి తలుపు తట్టాడు. ఒక నౌకరు వచ్చి తలుపు తెరిచాడు.

"పూల్, జెకిల్ ఇంట్లో ఉన్నాడా?"

"చూస్తాను" అంటూ నౌకరు, లాయరును లోపలికి ప్రవేశపెట్టాడు. అక్కడ ఉండటం, ఇదివరకు ఎప్పుడూ లాయరుకు ఆనందాన్ని కలుగజేసేది. కాని యిప్పుడు అతనికి హైడ్ తలంపు దురభిప్రాయాన్ని కలుగజేసింది. అంతట్లోకే నౌకరు వచ్చి జెకిల్ ఇంట్లోలేని విషయాన్ని తెలియజేసాడు.

"హైడ్ పాతపరిశోధన గదిద్వారంగుండా లోపలికి రావటం చూశాను. జెకిల్ ఇంట్లో లేనప్పుడు అట్లా జరగటం తప్పు కదా!" అన్నాడు లాయరు.

"తప్పేమీలేదు. అతని దగ్గర ఒక తాళంచెవి ఉన్నది."

"మీ యజమానికి అతనంటే మంచి నమ్మకమనుకుంటానే?"

"అవును, అతను ఏం చెబితే అది చేయమని మాకు ఆజ్ఞ."

"నేనికడెప్పుడూ అతన్ని కలుసుకోలేదే."

"అతడెప్పుడూ ఇక్కడ భోంచేయడు. ఈ వైపుకు అసలు ఎప్పుడూ రానేరాడు. ఎంతసేపూ మీరు చూసిన ద్వారంగుండా రావటం, పోవటం జరుగుతుంది."

"సరే వస్తాను."

"మంచిది."

బరువైన హృదయంతో లాయరు ఇంటికెళ్ళాడు. "పాపం, జెకిల్ చాలా కష్టదశలో నున్నాడు. చిన్ననాటి అవినీతితో గూడిన సుఖాల ఫలితం ఇప్పుడనుభవిస్తున్నాడు" అనేదే అతని మథన. ఒక్కసారి అతని శరీరం గగుర్పొడిచింది. ఒక్కసారి తన పూర్వ జీవితాన్ని జ్ఞప్తికి తెచ్చుకున్నాడు,

ఇంకా ఇలా అనుకున్నాడు తనలో తను, "హైడ్ జీవితంలోగూడా కొన్ని అమానుషమైన రహస్యాలు ఉండి ఉంటాయి. వాటి ముందర జెకిల్ లోపాలు, లోపాలేకావు. జెకిల్ వీలునామాలోని విషయాలు, హైడ్‌కు గనుక తెలిస్తే ఇంకేముంది? హైడ్, జెకిల్‌ను హత్య చేస్తాడేమో అనిగూడా భయం వేస్తోంది. ఏమంటే సమయం వచ్చేవరకూ వేచియుండే ఓపిక హైడ్‌కు ఏ మాత్రమూ ఉండదు. ఏమైనా సరే, జెకిల్‌ను హైడ్ బారినుండి రక్షించాలి. తప్పకుండా నా శక్తి

కొలదీ పనిచేసి రక్షించితీరుతాను. అయితే నాకు జెకిల్ అడ్డు రాకుండా మాత్రం ఉండాలి,"

అతని మనోనేత్రం ముందర, జెకిల్ వీలునామాలోని వింతవాక్యాలు ఒకసారి ప్రత్యక్షమయ్యాయి.

---

# 3. జెకిల్‌తో ఒకనాడు

అదృష్టవశాత్తు, రెండువారాల తరువాత డాక్టరు జెకిల్ అయిదారుగురు పాత స్నేహితులకు ఒక గొప్ప విందు చేసాడు. స్నేహితులందరూ గౌరవనీయులైన పెద్దమనుష్యులే. అందులో అట్టర్సన్ ఒకడని వేరే చెప్పక్కర్లేదు. విందు తరువాత అందఱూ వెళ్ళిపోయారు. కాని అట్టర్సన్‌మాత్రం వెళ్ళలేదు. ఇదేం క్రొత్తగాదు. ఎప్పుడూ జరుగుతున్నదే. జెకిల్‌కు అట్టర్సన్ అంటే చాలా యిష్టం. జెకిల్‌కు ఇప్పుడు ఏభై ఏళ్లు. చూడటానికి గంభీరంగా, అందంగా ఉంటాడు.

స్నేహితు లిద్దరూ నిప్పుకుంపటికి రెండు వైపులా కూర్చు న్నారు.

"నేను నీతో మాట్లాడాలనుకుంటున్నాను. నీ వీలు నామా సంగతి తెలుసుగా?" అన్నాడు లాయరు.

డాక్టరును జాగ్రత్తగా పరిశీలించిన వారికి, ఈవిషయం అతనికి అయిష్టంగా ఉందనే విషయం బాగా తెలుస్తుంది. కాని డాక్టరు సంతోషంగా ఉండటానికి ప్రయత్నించాడు.

"నాలాంటి కాతాదారు ఉండటం నువ్వు దురదృష్ట వంతుడవుసుమా. నా వీలునామా నిన్ను బాగా కలవరపెట్టింది. పాపం, లేన్యన్ చాలా మంచివాడే - కాని నా శాస్త్రసంబంధమైన అభిప్రాయాలు అతన్ని ఇంకా ఎక్కువగా కలవరపెట్టాయి" అంటూ జెకిల్, విషయాన్ని మార్చాలని ప్రయత్నించాడు.

"వీలునామాలోని విషయం సరియైనది కాదనే నా అభిప్రాయం" అన్నాడు లాయరు, క్రొత్తవిషయాన్ని గమనించకుండా.

"నా వీలునామా? నాకు తెలుసు. నువ్వు ఆవిధంగా చెప్పావుగూడాను" అన్నాడు డాక్టరు కోపంలో.

"నేను మళ్ళీ చెబుతున్నాను. హైడ్‌నుగూర్చిన విషయాలు ఇప్పుడిప్పుడే నాకు కొద్దికొద్దిగా తెలుస్తున్నాయి."

జెకిల్ ముఖం పాలిపోయింది. కళ్ళచుట్టూ నల్లని రంగు ఆవరించింది. "నేనింకేమీ వినను. దీన్నిగూర్చి మనము తర్కించ దలచలేదుగదా!"

"నేను విన్నది భయానకమైనది సుమా."

"అయినాసరే. నా స్థితి నీకు అర్థంకాదు. నా పరిస్థితి చాలా విచిత్రంగా ఉంది. మాటలవల్ల అది మారదు."

"జెకిల్, నన్ను నీవెరుగుదువు. నన్ను నీవు ఏమీ సంకోచం లేకుండా నమ్మవచ్చు. కథంతా చెప్పు. నేను నిన్ను నీ కష్టాలనుండి గట్టెక్కిస్తాను."

“ అట్టర్సన్, నీవు చాలామంచివాడివి. నీకు ఎల్లప్పుడూ కృతజ్ఞుణ్ణేసుమా. నాకృతజ్ఞతను తెలపటానికి నాకు మాటలు చాలటంలేదు. నేను నిన్ను పూర్తిగా నమ్ముతాను. నిస్సంకోచంగానమ్ము. కాని నీవనుకుంటోన్న విషయం కాదు సుమా. నీవను కుంటున్నంత చెడు ఏమీ లేదు. నీ మనశ్శాంతికి ఒక్క విషయాన్ని చెబుతానువిను. నేను అనుకున్న తక్షణం హైడ్‌ను వదిలించుకోగలను. నేను నీకు నమ్మబలుకుతున్నాను. నీకు తిరిగి నాకృతజ్ఞత తెల్పుతున్నాను. నేను ఇంకొక్క చిన్నవిషయం చెబుతాను. అట్టర్సన్, ఇది నావ్యక్తిగతమైన స్వంత వ్యవహారం. అది అట్లా జరుగవలసిందే. అందులో ఎవరూ జోక్యం కలుగజేసికోకూడదు.”

“ బహుశా నువ్వు చెప్పిందిరైటే ”

“ దీనిని గూర్చి నీవు ఆఖరిసారిగా మాట్లాడావనుకుంటున్నాను. నేను నిన్ను ఒక్క విషయం అర్థం చేసికోగోరుతున్నాను. నేను హైడ్ శ్రేయోభిలాషినిసుమా. నీవు అతన్ని చూసావని నాకు తెలుసు. అతడు నాకు చెప్పాడు. బహుశా అతడు నీదగ్గర అమర్యాదగా ప్రవర్తించి యుంటాడు. కాని అతడంటే నాకు గాఢమైన అభిమానం. నేను మరణించిన తరువాత, నీవు సహనంతో అతని హక్కుల నన్నిటిని కాపాడతానని వాగ్దానంచెయ్యి. సంగతి అంతాపూర్తిగా తెలిస్తే నువ్వు తప్పకుండా చేస్తావు. నువ్వుచేస్తే నాహృదయ భారం తగ్గిపోతుంది.”

"నేను అతడంటే ఎప్పుడైనా గానీ ఇష్టపడతానని అనుకోను."

"నేను అది అడగటంలేదు. నేను న్యాయాన్ని మాత్రమే కోరుతున్నాను. నేను ఈ లోకంలో లేనపుడు, నా కొఱకైనా అతనికి సహాయం చెయ్యవలసిందని మాత్రమే కోరుతున్నాను"అన్నాడు జెకిల్, లాయర్ చెయ్యిమీద చెయ్యివేసి.

లాయరు అట్టర్సన్ ఒక్క వేడినిట్టూర్పు విడువకుండా ఉండలేకపోయాడు. "సరే, నేను వాగ్దానం చేస్తున్నాను" అన్నాడు చిట్టచివరకు.

---

# 4. హైడ్‌చేసిన హత్య

ఒక సంవత్సరం గడిచింది. అది అక్టోబరు నెల. అప్పుడు లండన్ వాసులకు విభ్రాంతిగొల్పే ఒక హత్యజరిగింది. హత్య చేయబడినవాడు ఉన్నత స్థితికి చెందిన వాడవటంమూలాన దానికింకా ఎక్కువ ప్రాముఖ్యం వచ్చింది. ఆ హత్యకు సంబంధించిన వివరాలివి.

ఒక పనిచేసే అమ్మాయి రాత్రి పదకొండు గంటలకి పడుకోటానికి మేడపైకి వెళ్ళింది. చంద్రుడు శోభాయమానంగా ప్రకాశిస్తున్నాడు. అమ్మాయి పెట్టెమీద

కూర్చొని, కిటికీ గుండా బయటకు చూస్తోంది. అప్పుడే, నెరసిన వెంట్రుకలు గల ముసలివాడు ఆసన్నని సందుగుండా వస్తున్నాడు. అదే సమయానికి ఎదురుగా ఒక పొట్టిమనిషి వస్తున్నాడు. సరిగ్గా వారిద్దరూ అమ్మాయికి కనబడేటట్లు కలిసికొన్నారు. ముసలివాడు పొట్టిమనిషితో మర్యాదగానే మాట్లాడాడు. దారి అడుగుతున్నాడు కాబోలు అనుకుంది అమ్మాయి. అంతలోకే ఆపొట్టి మనిషిని గుర్తుపట్టింది. అతడెవరో కాదు - హైడ్. ఒకసారి తన యజమాని యింటికి రాగా చూచింది. చూసి అసహ్యించుకుంది కూడాను.

హైడ్ చేతిలో ఒక గట్టి కర్ర ఉంది. దాన్నతడు చేతుల్తో ఆడిస్తున్నాడు. ముసలివాడు చెప్పింది వింటూ, జవాబు మాత్రం చెప్పటంలేదు. ఉన్నట్టుండి కోపోద్రేకుడయ్యాడు. కర్ర విసురుతూ, పిచ్చివానిలా ప్రవర్తించాడు. ముసలివాడు ఆశ్చర్యంతో ఒక అడుగు వెనక్కి వేసాడు. కాని హైడ్ కఱ్ఱతో అతన్ని భూమిమీద పడేసాడు. ఒక అడవి మృగంవలె మీదెక్కి కాళ్ళతో తొక్కటం ప్రారంభించాడు. కర్రతో మోదాడు. ఈ భయానక దృశ్యంచూచి అమ్మాయి మూర్ఛపోయింది.

అమ్మాయికి స్మృతి వచ్చేటప్పటికి గడియారం రెండు కొట్టింది. వెంటనే పోలీసువారికి కబురు పంపించింది. అప్పటికి చాలాకాలం క్రితమే హంతకుడు వెళ్ళిపోయాడు. ముసలివాడు మాత్రం రోడ్డుమీద చచ్చి పడి ఉన్నాడు. గట్టిగా కొట్టటం వల్ల కర్ర రెండు ముక్కలయింది. చేతిలో మిగిలిన ముక్కను

హంతకుడు పట్టుకుపోయి ఉంటాడు. చివరి సగం రోడ్డుకు ప్రక్కగా పడి ఉంది. చనిపోయిన వాని వద్ద ఒక విలువైన గడియారం, ఒక పర్సు, అట్టర్సన్ విలాసముగల ఒక కవరు ఉన్నాయి.

పోలీసువారు తెల్లవారకముందే అట్టర్సన్‌ను కలిసికొని మరణవార్త చెప్పి ఉత్తరం యిచ్చారు. అతడు వెంటనే శవాన్ని చూడటానికి పోలీసుస్టేషనుకు బయలుదేరాడు. శవాన్నిచూచి, అది సర్ డేన్వర్స్ కేరూ అని గుర్తుపట్టాడు. పోలీసు అధికారి, అమ్మాయి చెప్పిందంతా అట్టర్సన్‌కు చెప్పాడు. హైడ్ పేరు చెప్పేటప్పటికె అట్టర్సన్ అదోలా అయిపోయాడు. విరిగిన కర్రముక్కచూపెట్టాక అతని అనుమానం కాస్తా తీరిపోయింది. అది అతడు డాక్టర్ జెకిల్‌కు చాలా సంవత్సరాల క్రితం బహుమానంచేసినకర్ర.

" హైడ్ పొట్టిమనిషికదా? " అన్నాడు అట్టర్సన్. "అవును. చూసిన అమ్మాయి అట్లాగే చెప్పింది." అన్నాడు అధికారి.

హైడ్ అడ్రసు తెలిసిన అట్టర్సన్, సోహోలో ఒక మురికివీధిలో ఉన్నహైడ్ ఇంటికి పోలీసువారిని తీసికెళ్ళాడు. నెరెసిన జుట్టు గల ఒక ముసలిది తలుపు తెరిచింది. ఆమె ముఖంలో కుటిలంఉన్నా, మాటలు మాత్రం మర్యాదగానే ఉన్నాయి. ఆమె వారితో చెప్పిన విషయం ఇది. "ఇది హైడ్ ఇల్లే. కాని ఆయన యింట్లోలేడు. గతరాత్రి చాలా పొద్దుపోయాక వచ్చి గంటసు లోపుగా ఉండి తిరిగి వెళ్ళి

పోయాడు. ఇంతకు పూర్వం రెండు నెలల క్రితం మాత్రమే ఇక్కడకు వచ్చాడు." హైడ్ గదులను చూడాలని వారు అనగా, ముసలమ్మ తన అసమ్మతిని చూపింది. కాని వారు పోలీసువారని తెలిసిన తరువాత, లోపలికి వెళ్ళనిచ్చింది. వారు గదులన్నీ పరిశీలించి కొన్ని సంగతులు గ్రహించారు.

హైడ్ ఇంట్లో రెండు గదులు మాత్రమే ఉపయోగించేవాడు. ఆ రెండు గదులనిండా కావలసినంత మేలురకపు ఫర్నిచరు ఉంది. ఒక ద్రాక్షసారా పీపాగూడ ఉంది. చెంచాలు, ఫోర్కులు అన్నీ వెండివే. గోడలమీద మంచిమంచి పటాలు వేలాడుతున్నాయి. తివాసీలు రంగురంగులతో దట్టంగా అందంగా ఉన్నాయి. అయితే ఆగదులు కొద్దిసేపటి క్రిందే చిందరవందర గావింపబడినట్లున్నాయి. బట్టలు నలుమూలలకు విసరి వేయబడి ఉన్నాయి. చొక్కా జేబులు బయటకు తీయబడి ఉన్నాయి. కుంపట్లో చాలా కాగితాలు తగల బెట్టబడినట్లు బోలెడంత బూడిద ఉంది. అందులోంచి పోలీసు ఇనస్పెక్టరు సరిగ్గా కాలని ఒక పచ్చని చెక్కుపుస్తకాన్ని బయటకులాగాడు. సగం కర్రా తలుపు ప్రక్కనే కనబడింది. పోలీసు ఇనస్పెక్టరుకు చాలా సంతోషం కలిగింది. ఏమంటే పై రెండు వస్తువులూ హంతకుణ్ణి పట్టుకోటానికి ఉపకరించవచ్చు. పోలీసు ఇనస్పెక్టరు బ్యాంకుకు వెళ్ళి హంతకునికి చాలా వేల పౌనులు నిలువ ఉన్నట్లు తెలిసికోగలిగాడు.

పోలీసు ఇనస్పెక్టరు అట్టర్సన్‌తో ఇల్లా అన్నాడు, "హంతకుడు నాచేతిలో చిక్కాడు. వాడికి మతిపోయి

ఉంటుంది. లేకపోతే సగంకల్రా ఇక్కడ వదిలి పెట్టి ఉండడు. అదీకాక చెక్కుపుస్తకం కాల్చి ఉండడు. డబ్బులేకుండా అతడెట్లా జీవిస్తాడు? మన మేమీ చెయ్యక్కర్లేదు. బ్యాంకు దగ్గర వేచియుంటే అతడే పట్టుబడతాడు."

అయితే హైడ్‌ను పట్టుకోటం అంత సులభంగా లేదు. అతనికి స్నేహితులు లేనేలేరని చెప్పొచ్చు. పనిచేసే అమ్మాయి యజమానైనా అతణ్ని రెండుసార్లే చూచాడు. అతనికి కుటుంబమేమీ లేదు. అతనెప్పుడూ ఫొటో తీయించుకోలేదు. ఆతన్ని చూసిన బహుకొద్దిమందైనా అతని ఆకారాన్ని గూర్చి తలోరకంగా చెబుతున్నారు. ఏదో అవయవ లోపమున్నవాడిలా కనబడ్తాడని మాత్రం అందరూ చెబుతారు.

---

# 5 జెకిల్ ఇచ్చిన ఉత్తరం

ఒకనాటి మధ్యాహ్నం అట్టర్సన్ డాక్టర్ జెకిల్ ఇంటికి వెళ్ళాడు. జెకిల్ నౌకరైన పూల్, అతణ్ణి ఒక దొడ్డిగుండా 'లేబరేటరీ' అని పిలువబడే ఇంటిభాగానికి తీసికెళ్ళాడు. లాయరు ఆ ఇంటిభాగానికి వెళ్లటం అదే మొదటిసారి. ఆభాగానికి కిటికీలేమీ లేవు. చాలాచీకటిగా ఉంది. అట్టర్సన్ 'లేబరేటరీ' చివరి భాగానికి వెళ్లి, అక్కడ మేడ మెట్లెక్కి ఎఱ్ఱని తెరతో కప్పబడిన ద్వారముగుండా డాక్టర్ జెకిల్

ప్రయివేటు గదిలోకి వెళ్ళాడు. అది చాలా పెద్దగది. చాలా సామాన్లుగూడా ఉన్నాయి. ఆ పెద్ద గదికి మూడు కిటికీలు గూడా వున్నాయి. కుంపటివద్దగా డాక్టర్ జెకిల్ జబ్బు ముఖంతో కూర్చునియున్నాడు. స్నేహితుణ్ణిచూసి అతడు లేవలేదు. జీవం లేని చెయ్యిచాపి ఆహ్వానించాడు. గొంతుకూడా మారి పోయింది.

అట్టర్సన్, హత్య ప్రసక్తితెచ్చి జెకిల్, తన క్లయింట యిన కేరూను చంపిన హైడ్‌ను దాచటం లేదుకదా అని ప్రశ్నించాడు.

" నేను దైవసాక్షిగా చెబుతున్నాను. అంతా ఆఖర యింది. నేనింకా హైడ్‌ను చూడను. హైడ్‌కు నా సహాయం ఏమీ అవసరంలేదు. ఇంక మనం అతణ్ణిచూడం."

ఈమాటలు అట్టర్సన్‌కు ఏమీ ఉత్సాహాన్ని కలిగించ లేదు. అతడు జెకిల్ మాటలు నమ్మలేదు కూడా. " జెకిల్, విచారణ జరిగితే నీపేరుగూడా బయటకు వస్తుంది సుమా! ఇప్పుడే చెబుతున్నాను. తరువాత నీయిష్టం."

" అతడింకా కనబడడనే విషయం నాకు గట్టిగా తెలుసు. ఎవ్వరికీ చెప్పగూడని కారణాలు కొన్ని ఉన్నాయి. అయితే ఒక విషయాన్నిగూర్చి నీసలహాకావాలి సుమా. నాదగ్గర ఒక ఉత్తరం ఉంది. అదిపోలీసువారికి చూపెట్టాలో, వద్దో నాకేమీ తోచటంలేదు. ఆ ఉత్తరం నీచేతుల్లో పెడ తాను. నువ్వంటే నాకు అంత నమ్మకముంది."

"ఆఉత్తరం హైడ్‌ను పట్టుకోటానికి ఉపకరిస్తుందనా నీభయం ?"

"హైడ్‌తో నాకేమీ నిమిత్తంలేదు. ఇప్పుడు నేను నామాన మర్యాదలను గూర్చి మాత్రమే ఆలోచిస్తున్నాను."

అట్టర్సన్ కొంచెంసేపు ఆలోచించాడు. జెకిల్ స్వార్థపరత్వం అతనికి ఆశ్చర్యం కలిగించింది. కాని అతని భారాన్ని గూడా తగ్గించింది.

"అయితే ఆ ఉత్తరం ఏది?"

అట్టర్సన్ ఉత్తరాన్ని జాగ్రత్తగా పరిశీలించాడు. ఉత్తరం వింతగా ఉంది. క్రింద 'ఎడ్వర్డ్ హైడ్' అని సంతకం ఉంది. ఆ ఉత్తరంలో తాను జెకిల్‌కు ముఖ్యస్నేహితుడై యుండి,అమిత సహాయాన్ని పొంది, అమానుషంగా ప్రవర్తించినందుకు విచారిస్తున్నాననీ, తాను సులభంగా తప్పించుకునే మార్గం ఉన్నది కనుక, తన కొఱకు జెకిల్ విచారించ నవసరం లేదని ఉంది. అట్టర్సన్ ఆ ఉత్తరాన్ని చూచి హర్షించాడు.

"ఉత్తరం పైకవరు ఉందా ?"

"లేదు. ఏంచేస్తున్నానో ఆలోచించక ముందే తగులబెట్టేసాను. దానిమీద పోస్టుముద్ర ఏమీ లేదు. ఉత్తరం ఎవరో తీసికొచ్చి ఇచ్చారు."

"సరే, ఈ ఉత్తరం నాదగ్గర ఉంచుకొని ఏంచెయ్యాలో ఆలోచించొచ్చా?"

"నీకు ఏది సరి అని తోస్తే అది చెయ్యి. నామీద నాకే నమ్మకంలేదు."

తిరిగి వెళ్ళిపోతూ అట్టర్సన్ మాటలమధ్య పూల్‌ను ఇట్లా అడిగాడు, "సరే, ఇవ్వాళ ఎవరో ఒక ఉత్తరం తీసుకొచ్చి ఇచ్చారుగదా. ఆ తెచ్చినవాడు ఎలా ఉంటాడు?"

"ఇవ్వాళ ఉత్తరాలు పోస్టుద్వారా తప్ప వేరే రాలేదు. అవైనా ఆచ్చువి."

ఈ విషయం మళ్లీ అట్టర్సన్‌కు భయాన్ని కలిగించింది. అతని మనస్సులోని ఊహాలు ఇవి. "ఈ ఉత్తరం లేబరేటరీ ద్వారంగుండా వచ్చిందన్నమాట స్పష్టమే. అదీగాక ఉత్తరం లేబరేటరీలోనే వ్రాయబడిందేమో కూడాను. అదే నిజమైతే నేను వేరుగా ఆలోచించాలి. జాగ్రత్తగా ఉండాలి. ఇంకెవరినయినా దీన్నిగురించి అడుగుతాను. అసలు విషయం మాత్రం చెప్పకూడదు."

ఆనాటి సాయంకాలం అట్టర్సన్ తన హెడ్ గుమాస్తా గెస్ట్‌తో కుంపటి దగ్గరకూర్చున్నాడు. గెస్ట్‌కు ఉత్తరం చూపాలని అట్టర్సన్ తలంపు. అతని రహస్యాలన్నీ గెస్ట్‌కు తెలుసు. గెస్ట్ జెకిల్‌ను, పూల్‌ను బాగా ఎరుగును. పైగా గొప్ప దస్తూరీ విమర్శకుడు. అంచేత హైడ్ వ్రాసిన ఉత్తరాన్ని గెస్ట్‌కు ఇచ్చి, ఆఉత్తరాన్ని ఒక దస్తూరీ పరిశీలకునిగా పరిశీలించవలసిందని అట్టర్సన్ కోరాడు. గెస్ట్ ఉత్తరాన్ని పరిశీలించి "ఇది ఒక వింతదస్తూరీ. దీన్ని వ్రాసినవాడు పిచ్చివాడను కోటానికి వీల్లేదు" అన్నాడు. అంతట్లో నౌకరు ఒక ఉత్తరాన్ని తెచ్చియిచ్చాడు.

"అది డాక్టర్ జెకిల్ వద్దనుండా? దస్తూరీ నాకు తెలుసు లెండి. ఏమన్నా రహస్యమా?" అన్నాడు గెస్ట్.

"అబ్బే, విందు పిలుపు. చూస్తావా?"

గెస్ట్ విందుఆహ్వానపు టుత్తరాన్ని తీసికొన్నాడు. రెండు ఉత్తరాల్ని ఒకదాని ప్రక్క ఒకటి పెట్టి దస్తూరీలను జాగ్రత్తగా పోల్చి పరిశీలించాడు. తరువాత అతడు వెలి బుచ్చిన అభిప్రాయం ఇది. "ఈ రెండు దస్తూరీలకు వింత మైన పోలిక ఉంది. అనేక విషయాలలో ఈ రెండు దస్తూరీలు ఒకే విధంగా ఉన్నాయి. తేడా ఏమిటంటే ఒకదానిలో అక్ష రాలు నిటారుగా ఉన్నాయి. ఇంకోదాంట్లో ఆవిధంగాలేవు."

అట్టర్సన్ తన గుమాస్తాను ఆవిషయాన్నంతా అతి రహస్యంగా ఉంచవలసిందిగా కోరాడు. 'సరే' నన్నాడు గుమస్తా. లాయరు ఆ ఉత్తరాన్ని ఇనప్పెట్టెలో భద్రంగా దాచాడు. 'జెకిల్ హంతకుని తరఫున ఉత్తరాలుగూడా వ్రాస్తాడా?' అన్న సంశయం అతనికి కలిగింది. ఒక్కసారి వళ్ళు జలదరించింది.

---

# 6. డాక్టర్ లేన్యన్ మరణం

కాలం పరుగెత్తుకుపోతోంది. హంతకుణ్ణి పట్టుకోటానికి పోలీసువారికి ఆచూకీ యిచ్చేవారికి వేలకొలది పౌనులు బహు మానం యివ్వబడునని విరివిగా ప్రచారం చేయబడింది.

కాని ఎవరూ ఆచూకీ యివ్వలేకపోయారు. హంతకుని పూర్వజీవితంలోని అనేక చెడువిషయాలను గూర్చి పోలీసు వారు వివరాలు తెలిసికోగలిగారు. కానీ ప్రస్తుతం అతడు ఎక్కడున్నాడనే విషయాన్ని గూర్చి వారు పీసమెత్తు సంగతి నయినా తెలిసికోలేక పోయారు. ఎక్కడా అతని జాడలు లేవు.

దుష్టప్రభావం తొలగిపోవటంచేత డాక్టర్ జెకిల్ క్రొత్త జీవితాన్ని ప్రారంభించాడు. తిరిగి స్నేహితులతో కలసిమెలసి ఉండటం మొదలెట్టాడు. విందులకు వెళ్లేవాడు. విందులకు పిలిచేవాడు. బీదవారికి సహాయం చేస్తున్నాడు. మత విషయాలలో ఆసక్తి కనబరుస్తున్నాడు. ఈ విధంగా రెండు నెలలు శాంతిగా కాలంగడిచింది.

ఈ కాలంలో అట్టర్సన్, డాక్టర్ జెకిల్ ఇంటికి స్వేచ్ఛగా రాకపోకలు సాగించాడు. అయితే ఒకనాడు హఠాత్తుగా అట్టర్సన్‌కు, జెకిల్ ద్వారం బందయింది. డాక్టర్ జెకిల్ ఎవరినీ చూడదలచుకోలేదని నౌకరు పూల్ చెప్పాడు. అట్టర్సన్ మళ్లీ ఒకసారి ప్రయత్నించి విఫలుడయ్యాడు. ఏకాంత జీవితం గడపటం దుస్సహంగా తోచి ఒకనాడు డాక్టర్ లేన్యన్ ఇంటికి వెళ్లాడు.

లోపలికెళ్లి లేన్యన్ రూపాన్ని చూచేసరికి, లాయరు కొయ్యబారిపోయాడు. లేన్యన్ ఎఱ్ఱని ముఖం పాలిపోయింది. సన్నపడిపోయాడు. వయసుకు మించిన వార్ధక్యం ఆవహించింది. భయమనస్కుడై కూడా ఉన్నాడు, మరణకాలం ఆసన్న మైందని భయపడుతున్నట్లుంది, "శరీరారోగ్యం బాగున్నట్టు

లేవ''ని లాయరు అనేసరికి "నాకు ఒక గొప్ప షాక్ తగిలింది. దానినుంచి నేను కోల్కోలేను. నా జీవితం వారాల్లోకి వచ్చింది. ఇదివరకు జీవితం బాగా గడిచింది. పూర్తి విషయాలు తెలుస్తే త్వరగా జీవితం చాలిద్దామనిపిస్తుంది'' అన్నాడు లేన్యన్.

"జెకిల్ కుగూడా జబ్బుగా ఉంది. అతణ్ణి చూచావా?" ఈ ప్రశ్న వినేసరికి లేన్యన్ ముఖం రంగు ఇంకా అధ్వాన్న మయింది. చేతులు వణకజొచ్చాయి. "జెకిల్ ను చూడగోరను. అతణ్ణిగూర్చి వినగోరను. అతనికి నాకు తెగ తెంపులయింది. అతడు నాకు చచ్చినవాడితో సమానం."

ఈ మాటలు లాయరుకు విచారాన్ని కలిగించాయి. తమ మిత్రుడగు డాక్టర్ జెకిల్ కు సహాయం చెయ్యవలసిన ముఖ్యబాధ్యత తమపై ఉన్నదని అన్నాడు. అప్పుడు లేన్యన్, జెకిల్ నుగురించి యింక ఏంమాట్లాడినా తాను భరించలే నన్నాడు. తాను చనిపోయిన తరువాతైనా మంచి చెడ్డలన్నీ తెలుస్తాయని అన్నాడు.

అట్టర్సన్ ఇంటికి వెళ్ళగానే తనను చూడనివ్వక పోవ టానికి కారణమేమిటో, డాక్టర్ లేన్యన్ తో తెగ తెంపులు చేసుకోటానికి కారణమేమిటో తెలుపవలసిందంటూ జెకిల్ కు ఒక ఉత్తరం వ్రాసాడు. మఱుసటిరోజునే జెకిల్ దగ్గరనుంచి జవాబువచ్చింది.

"అంతా నాదే తప్పు. డాక్టర్ లేన్యన్ దే అంతా రైటు. నేను పాపుల్లోకెల్లా ఎక్కువ పాపిని. ఎక్కువ బాధ పడు

తున్నానుగూడా. నా బాధలు, భయాలు అమితం. అందుచేత నా చీకటిదారినే నేను పోవాలి. నేను ఎక్కడకూ వెళ్ళను. ఎవరినీ కలిసికోను. నా ఏ కాంతాన్ని గౌరవించటమే ముఖ్య స్నేహితుడవైన నీ విధి.''

అట్టర్సన్ ఆశ్చర్య చకితుడయ్యాడు. దుష్ట సహవాసం పోగొట్టుకొని ఒక వారం క్రితం వరకు అంతా బాగానే కనిపించాడు డాక్టర్ జెకిల్. కాని యిప్పుడు మనశ్శాంతిని కోల్పోయాడు. ఇదేం పిచ్చా? ఇంతకంటే ఏదో అగాధమైన కారణముండియుండా లనుకున్నాడు అట్టర్సన్.

ఒకవారం రోజులకు డాక్టర్ లేన్యన్ మంచం పట్టాడు. రెండు వారాలలోపులో మరణించాడు. ఆనాటి అంత్యక్రియలు పూర్తి అయ్యాయి. అట్టర్సన్ చాలా విచారంగా ఉన్నాడు. ఆ రాత్రి తనగదిలో కూర్చొని తన ప్రియస్నేహితుని దగ్గర నుండి వచ్చిన కవరును బయటకు తీసాడు. ఆ కవరుమీద "అట్టర్సన్‌కుమాత్రమే'' అని ఉంది. ఆ కవరులోపల ఇంకో కవరు ఉంది. దానిపై "డాక్టర్ జెకిల్ చనిపోయిన తరువాత గాని, అదృశ్యమైన తరువాతగాని మాత్రమే విప్పి చూడాలి'' అని ఉంది. అట్టర్సన్ అప్పుడే ఆ కవరు చింపి చూడాలను కున్నాడు గాని, తన స్నేహితుడు తనయందుంచిన విశ్వాసాన్ని భంగపరచినట్టుంటుందని ఆ ప్రయత్నం మానేసాడు. కవరు ఇనప్పెట్టెలో జాగ్రత్తగా భద్రపరచాడు.

ఆనాటినుంచి అట్టర్సన్‌కు డాక్టర్ జెకిల్‌ను చూడబుద్ధెయ్యలేదు. కాని అతనిపట్ల సానుభూతిమాత్రం ఉంది.

జెకిల్‌కు ఏం అపాయం కలుగనున్నదో అని భయపడు తున్నాడు. ఒక్కొక్కప్పుడు డాక్టర్ జెకిల్ ఇంటికివెళ్ళి, గుమ్మం దగ్గరే నౌకరు పూల్‌తో మాట్లాడేవాడు. కాని ఉత్సాహకరమైన విషయాలేమీ తెలిసేవి కావు. "డాక్టర్ జెకిల్ ఎప్పుడూ తన ప్రయివేటు గదిలో కూర్చొనేవాడు. ఒక్కొక్క ప్పుడు అక్కడే నిద్రపోయేవాడు. చాలా తక్కువ మాట్లాడే వాడు. చదివేవాడే కాదు."

---

# 7. కిటికీదగ్గర జెకిల్

ఒక ఆదివారంనాటి సాయంకాలం అట్టర్సన్, ఎన్‌ఫీల్డు మామూలుగా షికారుకు వెళ్తూ హైడ్ గృహప్రవేశం చేస్తూండే గృహద్వారం ముందుకు వెళ్ళారు. హైడ్‌ను ఇక ముందు చూడబోమని, అతని చరిత్ర ముగిసిందని ఎన్‌ఫీల్డు అన్నాడు. ఆ విషయాన్ని గూర్చి అట్టర్సన్ తన సంశయాన్ని వెలిబుచ్చాడు. ఆ గృహద్వారం, డాక్టర్ జెకిల్ ఇంటి దొడ్డి దారి అని తన పరిశోధనా సారాంశాన్ని వెలిబుచ్చాడు ఎన్‌ఫీల్డు. తాను జెకిల్ కొరకు ఆత్రుత చెందుతున్నాననీ అతనికి తగిన సహాయం చెయ్యాలనీ అంటూ అట్టర్సన్, ఎన్‌ఫీల్డును ఇంటి దొడ్డిలోనికి తీసికొనివెళ్ళాడు. కిటికీలను పరిశీలించాలని వారి తలంపు. మధ్య కిటికీ సగం తెరచిఉంది.

కిటికీకి ఎదురుగా విచార ముఖంతో డాక్టర్ జెకిల్ కూర్చొని యున్నాడు. అట్టర్సన్ డాక్టరును కుశల ప్రశ్నలు వేశాడు.

"శరీరంలో నీరసంగా ఉంది. త్వరలో నేకోల్కుంటాను."

"ఎప్పుడూ ఇంట్లోనే ఉంటావు. రా, షికారు కెళ్దాం"

"మంచిదేకాని రానటానికి వీల్లేదు. మిమ్మల్నైపైకి రమ్మందును గాని ఈ ప్రదేశం అంత బాగుండలేదు."

"సరే, మనం ఎక్కడివాళ్లం అక్కడే ఉండి మాట్లాడు కుందాం."

"నేనూ అదే అందామనుకుంటున్నాను" అన్నాడు డాక్టర్ జెకిల్ చిరునవ్వుతో.

అ మాటలు పూర్తి అయ్యాయో లేవో మందహాసం ఒక్కసారిగా మాయమైంది. ముఖంలో నిస్పృహ, భీతావహం గోచరించాయి. అట్టర్సన్, ఎన్ఫీల్డుల రక్తం ఒక్కసారి గడ్డ కట్టుకు పోయినట్లయింది. మరుక్షణంలో కిటికీ తలుపులు మూయ బడ్డాయి. స్నేహితులిద్దరూ మాట్లాడకుండా నడవటం ప్రారం భించారు. రాజవీధికి వచ్చాక మాత్రమే ఇరువురూ ఒకరికేసి ఒకరు చూచుకున్నారు. ఇద్దరి ముఖాలు పాలిపోయాయి. కళ్లల్లో భయం గోచరిస్తూంది.

---

# 8. ఆత్మహత్య

ఒకనాటి సాయంకాలం భోంచేసిం తర్వాత అట్టర్సన్ కుంపటి దగ్గర కూర్చున్నాడు. అప్పుడు పూల్ భయంతో

అక్కడకు వచ్చాడు. డాక్టర్ జెకిల్ ఎల్లప్పుడూ తన ప్రయివేటు గదిలోనే కూర్చుంటున్నాడనీ, ఏదో చెడుజరిగి ఉంటుందనీ, ఎవరో ఏదైనా అపాయం కలిగించారేమో అని తనకు సందేహంగా నున్నదనీ పూల్ చెప్పాడు.

ఈ మాటలు చెప్తూ పూల్, లాయరు ముఖంకేసి చూడక భయంతో నేల కేసే చూస్తున్నాడు. అట్టర్సన్ తక్షణం బయలుదేరి వెళ్ళటానికి నిశ్చయించుకున్నాడు. వెంటనే టోపీపెట్టుకొని, కోటుతొడుక్కొని పూల్ కూడా బయలుదేరాడు. డాక్టర్ జెకిల్ ఇంటికి వెళ్ళాక, పూల్ టోపీ తీసి, భయంతో ముఖంమీద పట్టిన చెమటను తుడుచు కున్నాడు. అక్కడ నౌకరులందరూ, భయంతో కంపటిచేట్టూ గుమిగూడి ఉన్నారు. అప్పుడు ఒక ఆడ నౌకరు అరవటం ప్రారంభించేసరికి, మాట్లాడవద్దని పూల్ గదమాయించాడు. పూల్ కొవ్వొత్తిపట్టుకొని ముందు నడుస్తుండగా, అట్టర్సన్ చప్పుడు చేయకుండా అనుసరించాడు. డాక్టర్ జెకిల్ పిలిచినా లోపలికి వెళ్ళవద్దని పూల్ లాయరును హెచ్చరించాడు. అప్పుడు లాయరు కొంచెం పిరికిపడ్డాడు గాని వెంటనే ధైర్యం తెచ్చుకొని 'లేబరేటరీ' వరకూ వెళ్ళాడు. తరువాత మేడ మెట్లవరకూ వెళ్ళాడు. ఒక ప్రక్కగా నుంచుని జరిగేదంతా వినవలసిందని పూల్ లాయరును కోరాడు. పూల్ మెట్లెక్కిపైకి వెళ్ళి అట్టర్సన్ వచ్చాడని చెప్పి తలుపు తట్టాడు. "ఇప్పుడు నే నెవరినీ చూడను" అని లోపల్నుంచీ జవాబు వచ్చింది. ఇద్దరూ వంటయింటికేసి వచ్చారు.

గదిలోంచీ వినబడ్డగొంతు, డాక్టర్ జెకిల్ గొంతు కాదంటంలో ఇద్దరూ ఏకీభవించారు. "మా యజమాని ఎనిమిదిరోజుల క్రిందట భగవంతుని నామం ఉచ్చరించినప్పుడే హత్యచేయబడ్డాడు. అయితే గదిలో ఎవరున్నారు? ఎందుకున్నారు? అనే విషయం నాకు అర్థమవటంలేదు" అని పూల్ అన్నాడు. "నువ్వు చెప్పిందాంట్లో సారంలేదు. హత్య చేసింతరువాత హంతకుడెప్పుడూ ఇక్కడ ఉండడు" అన్నాడు లాయరు. "గత వారంలో గదిలో ఉన్నాయన రోజూ మందుకోసం నన్ను పంపేవాడు. తనకు కావలసింది చీటీ మీద వ్రాసి మెట్లమీద పడేసేవాడు. రోజూ రెండు నాళ్లు, మూడు సార్లు మందులకోసం ఊళ్లోమందులషాపులన్నింటికీ వెళ్లేవాడిని. అయితే నే తెచ్చిన మందు శుద్ధమైంది కాదని, ఇంకో మందుల దుకాణానికి వెళ్లి కేవలసిందనీ కోరుతూండేవాడు. ఈ మందు ఆయనకు ఎంచేత అత్యవసరమైందో నాకు అర్థమవలేదు" అన్నాడు పూల్.

పూల్, లాయరుకు ఒక చీటీనిగూడా యిచ్చాడు. అందులో కంపెనీవారు ఇచ్చిన మందు పరిశుద్ధమైనది కాదని, నిరుపయోగమైనదనీ వ్రాసి ఉంది. తనకు లోగడ ఒకతేదీన అదే పేరుగల మందు ఇచ్చారనీ, జాగ్రత్తగా వెదకి అదే రకానికి చెందిన మందు పంపించవలసిందనీ గూడా వ్రాసి ఉంది. ఇంకా అందులో ఇల్లా ఉంది. "దేవునికొఱకు, పూర్వ రకానికి చెందిన మందు కొంత పంపండి." ఆ వ్రాత డాక్టర్ జెకిల్ దే.

అయితే ఆమందు అంత అవసరం ఎంచేత అయిందీ లాయరుకు అర్థం కాలేదు.

పూల్ ఇంకోవిషయం చెప్పాడు. "ఒకనాడు జెకిల్ గది తలుపులు తెరచిఉన్నాయి. నేను గదిలో మనిషిని చూచాను. యజమాని ముఖంలో పూర్తి మార్పు గోచరించేసరికి అమితంగా భయపడ్డాను కూడా. నన్ను చూసేసరికి అతడు ఎలుకలా అరచి దాక్కున్నాడు. అతడు నా యజమాని కాదు."

"బహుశా మీ యజమాని ఏదో జబ్బుతో బాధపడుతున్నాడు. అందుకోసమే ఆ మందుకోసం అంతగా ప్రయత్నిస్తున్నాడనుకుంటాను."

"కాదు కాదు. మా యజమాని పొడుగ్గా అందంగా ఉంటాడు. నేను చూచిన మనిషి పొట్టిగా కురూపిలా ఉన్నాడు."

తరువాత వారిద్దరూ గది తలుపులు బ్రద్దలుకొట్టి లోపలికి ప్రవేశించటానికి నిశ్చయించుకున్నారు. 'లేబరేటరీ' ద్వారం వద్ద కాచి ఉండటానికి ఇద్దరు నౌకర్లను పంపారు. పూల్, అట్టర్సన్‌లు జెకిల్ ప్రయివేటు గది దగ్గరకు వెళ్లివేచియున్నారు. అంతట్లోకే లోపల తేలికైన అడుగు చప్పుళ్లు వినిపించాయి. అవి జెకిల్ అడుగు చప్పుళ్లు కావు. "ఒకనాడు లోపల్నుండి ఆడదాని ఏడ్పు వినిపించింది" అన్నాడు పూల్. తర్వాత ఒక గొడ్డలి సంపాదించి ఇద్దరూ గది తలుపుల దగ్గరకు వెళ్లారు. "జెకిల్, నిన్ను నేను చూడాలి" అన్నాడు

గట్టిగా లాయరు. జవాబు రాలేదు. "తలుపు తీయకపోతే బద్దలు కొట్టాలిసొస్తుంది" అన్నాడు లాయరు మళ్లీ. "నన్ను కరుణించు, అట్టర్సన్" అని లోపల్నుండి జవాబు వచ్చింది. "అది హైడ్ గొంతు. తలుపు బద్దలుకొట్టు. పూల్," అన్నాడు లాయరు. పూల్ గొడ్డలితో ఒక దెబ్బ వేశాడు. లోపల్నుంచి భయంకరమైన కేక వినవచ్చింది. పూల్ ఐదుసార్లు దెబ్బలు వేశాక తలుపులు లోపలికి పడ్డాయి. లోపల అంతా ప్రశాంతంగా ఉంది. ఒకచోట ఎడ్వర్డు హైడ్ చచ్చిపడియున్నాడు. అతడు తనప్రాణం తానే తీసుకున్నాడు.

"రక్షించటానికైనా, శిక్షించటానికైనా మనం ఆలస్యంగా వచ్చాం సుమా. ఇంక మీ యజమానిని వెదకాలి" అన్నాడు లాయరు.

ఇల్లంతా వెతికారు. ఎక్కడా డాక్టర్ జెకిల్ జాడేలేదు. తిరిగి ప్రయివేటు గదిలోకి వచ్చి, టేబిల్ మీాద అట్టర్సన్ పేరిట ఉన్న ఒక పెద్ద కవరు చూసారు. అది విప్పగానే చాలా కాయితాలు బయట పడ్డాయి. మొదటిది జెకిల్ వీలునామా. ఇది పూర్వపు వీలునామావలెనే ఉంది. కాని 'ఎడ్వర్డు హైడ్' అని లోగడ ఉన్నచోట ఇప్పుడు 'అట్టర్సన్' అని ఉంది. జెకిల్ ఆస్తంతా లాయరుకు వస్తుందన్నమాట. ఆశ్చర్యంతో లాయరు రెండో కాయితం తీసి చదివాడు. అది లాయరు పేరిట జెకిల్ వ్రాసిన ఉత్తరం. అందులో డాక్టర్ లేన్యన్ యిస్తానని వాగ్దానంచేసిన ఉత్తరాన్ని, తన రహస్య గాథను తెలిపే కాయితాన్ని చదవమని ఉంది. జెకిల్ రహస్య

గాథ ఒకపెద్ద ప్యాకెట్‌లో ఉంది. ఆ గాథను ఇంటిదగ్గర ప్రశాంతంగా చదవాలనుకున్నాడు లాయరు. అర్ధరాత్రికి పూర్వమే తిరిగివచ్చి పోలీసులకు కబురంపిస్తానని కూడా అన్నాడు. లేబరేటరీ తలుపులకు తాళం వేసిన తరువాత డాక్టర్ లేన్యన్, డాక్టర్ జెకిల్‌ల గాథలు తీరిగ్గా చదవటానికి ఇంటికెళ్లాడు.

---

# 9. లేన్యన్ కథనం

అట్టర్సన్ డాక్టర్ లేన్యన్ ఉత్తరాన్నివిధంగా చదివాడు.

జనవరి 9వ తేదీన డాక్టర్ జెకిల్‌వద్దనుండి నాకొక రిజిష్టరు ఉత్తరం వచ్చింది. ఎప్పుడూ వ్రాయటం అలవాటులేని జెకిల్ నాకు ఉత్తరం వ్రాయటం, అందులోను రిజిస్టరు చేయటం నాకాశ్చర్యం వేసింది. విప్పిచూడగా ఉత్తరంలోని విషయం అంతకంటే ఆశ్చర్యంగా ఉంది. ఇదిగో ఆ ఉత్తరం.

ప్రియమైన లేన్యన్,

నువ్వు నా పాతస్నేహితుల్లో ఒకడవు. శాస్త్రసంబంధ విషయాల్లో భేదాభిప్రాయాలున్నా మనస్నేహానికేమీ భంగం రాలేదు. నాజీవితం నీమీద ఆధారపడి ఉన్న సమయం వచ్చింది. ఈరాత్రికి నువ్వు సహాయం చెయ్యకపోతే నేను

చచ్చానన్నమాటే. నువ్వు ఈ రాత్రి తిన్నగా మాయింటికి వెళ్ళాలి. నౌకరు పూల్ నీకోసం, వడ్రంగితోను, బీగాల పనివానితోను వేచియుంటాడు. వారి సహాయంతో నువ్వు నా ప్రయివేటు గది తలుపులు బద్దలుకొట్టి, ఒంటరిగా లోపలికి వెళ్ళాలి. ఎడమ ప్రక్కగా ఉండే బీరువా తెరవాలి. తాళం వేసి ఉంటే బద్దలు కొట్టాలి. అందులోంచి పైనుంచి క్రిందకు నాలుగో సొరుగుగాని, క్రిందనుంచి పైకి మూడో సొరుగుగాని (రెండూఒకటే) బయటకు తీయాలి. కొన్ని పౌడర్లు, ఒక చిన్ని సీసా, ఒక కాగితం పుస్తకం ఉన్నదే సరియైన సొరుగుసుమా. దానిని ఉన్నదున్నట్లు నీ యింటికి తీసుకెళ్ళాలి.

తరువాత నీవు నీ ప్రయివేటు గదిలో ఒంటరిగా ఉండాలి. అర్థరాత్రివేళ నాపేరు చెప్పి ఒక మనిషి వస్తాడు. అతనిని లోనికి రానిచ్చి నువ్వు నాయింటి దగ్గరనుంచి పట్టుకొచ్చిన సొరుగును ఇచ్చెయ్యాలి. నేను చెప్పినట్లుగా ప్రతి చిన్న విషయంలోనూ జాగ్రత్త వహిస్తూ చేస్తే ఎప్పుడూ కృతజ్ఞుణ్ణై ఉంటాను. నువ్వు నీ ప్రియ మిత్రుని రక్షించాలి సుమా.

హెన్రీ జెకిల్.

ఈ ఉత్తరం చదివి జెకిల్‌కి పిచ్చెత్తిందనుకున్నాను. అయితే అది రుజువవ్వాలిగదా! వెంటనే తిన్నగా జెకిల్ ఇంటికెళ్ళాను. పూల్‌కుగూడా అటువంటి ఉత్తరమేవచ్చి ఉండటంచేత అక్కడే ఉన్నాడు. వడ్రంగి, బీగాలపనివాడుగూడా సిద్ధంగా ఉన్నారు. అందరం జెకిల్ ప్రయివేటు గదిదగ్గరకు వెళ్లాం. తలుపులు బద్దలు కొట్టటానికి రెండు గంటలు పట్టింది.

లోపలికి ఒంటరిగా వెళ్లాను. తాళం లేకుండా ఉన్నబీరువా తెరచి, సరియైన సొరుగేదో బాగా పరిశీలించి బయటకుతీసి, తిన్నగా ఇంటికి తీసుకొచ్చాను. సొరుగులో పౌడర్లు చక్కగా అమర్చబడియున్నాయి. సీసాలో సగంవరకూ రక్తవర్ణ ద్రావకం ఉంది. దాని వాసన ఘాటుగాఉంది. నోటు బుక్కులో కొన్ని తేదీలు, శాస్త్రపరిశోధన విషయాలూ ఉన్నాయి. విషయం నాకు సరిగ్గా అర్థమవలేదు. జెకిల్‌కు పిచ్చెక్కిందను కున్నాను. అయినా, నౌకరులను పంపేసి నా గదిలో రివా ల్వారు సిద్ధంగా ఉంచుకొని ఒంటరిగా కూర్చున్నాను. వచ్చే వాడెవడో మరి! జాగ్రత్తగా ఉండాలిగదా? అర్థరాత్రయ్యే సరికి తలుపు తట్టారు ఎవరో. వెళ్ళి చూద్దునుగదా ఒక పొట్టి మనిషి. తాను జెకిల్ వద్దనుంచి వచ్చానని చెప్పేసరికి లోపలికి ప్రవేశపెట్టాను. ఆ పొట్టిమనిషి కురూపి. అతడు ధరించిన దుస్తులు అతనికి చాలా పెద్దవిగా ఉన్నాయి. అతన్ని చూస్తే ఎవరికైనా నవ్వు వస్తుంది. నాకు మాత్రం ఆశ్చర్యం, భయం కలిగాయి. పొట్టి మనిషి సొరుగేదన్నాడు. గుడ్డకప్పిఉన్న సొరుగు చూపించాను. హఠాత్తుగా వెళ్ళి గుడ్డ చింపేసాడు. ఒక కొలగ్లాసు ఇమ్మన్నాడు. ఇచ్చాను.

కొలగ్లాసులో కొన్ని చుక్కలు ఎఱ్ఱ ద్రావకంవేసి పౌడర్లలో ఒకదానిని కలిపాడు. అప్పుడు గ్లాసులో రసాయనిక మార్పు జరిగింది. దాన్ని టేబిల్‌మీద పెట్టాడు. నేను తెలివైనవాణ్ణయితే తనను గ్లాసు పుచ్చుకొని బయటకు వెళ్ళి పోనియ్యవలసిందిగా కోరాడు. లేక ఏం జరుగుతుందో తెలిసి

కోవాలని నాకు కుతుహూలముంటే, తాను చేయబోయేది నా ఎదురుగానే చేస్తానన్నాడు. అప్పుడు సైతానునైనా ఆశ్చర్య పరచే సంఘటన జరుగుతుందన్నాడు. ఏం జరుగుతుందో చూడాలని ఉందన్నాను. సరే చూడమని గ్లాసులో ఉన్నది ఒక్కసారిగా త్రాగేశాడు. అతడు నేలమీదపడిపోయేవాడే గాని, టేబుల్‌ను ఆనుకున్నాడు. అతని గుడ్లు ఊడిపడేటట్లు న్నాయి. క్రమంగా పెద్దవాడవజొచ్చాడు. ముఖం నల్లపడ జొచ్చింది. అదొక భయంకర దృశ్యం! దాన్ని భరించలేక ముఖం చేతులతో కప్పుకొని గోడకుచేర్లగిలబడ్డాను. "ఓదేవుడా ఓదేవుడా" అంటూ అరిచాను. ఏమంటే ఎదురుగా ఉన్నది పాలిపోయి, వణుకుతూ, చచ్చిబ్రతికినవాడిలా ఉన్న హెన్రీ జెకిల్ !

ఆనాటినుంచీ నేను చచ్చినవాడిలా అయిపోయాను! నిద్రలేదు. ఒక విధమైన భయం ఆవహించి నన్ను అన్ని వేళలా బాధింపసాగింది. మరణం ఆసన్నమైంది. ఆనాడు మొదట గదిలో ప్రవేశించింది కేరూహంతకుడగు హైడ్! చివరకు గది వదలివెళ్లింది హెన్రీ జెకిల్ !!

లేన్యన్

---

# 10. ఆత్మకథ

అట్టర్సన్, డాక్టర్ జెకిల్ స్వీయగాథ నీ విధంగా చదివాడు.

నేను ధనికుల కుటుంబంలో పుట్టాను. అయినా కష్టించి పనిచేసేవాడిని. భవిష్యత్తు చాలా ఆశాజనకంగా ఉంది. అందఱూ నన్ను గౌరవించేవారు. కాని నాకు ఐహిక సుఖాలంటే ఎక్కువ ఇష్టం. నేను వాటిని దాచవలసివచ్చేది. ఈ విధంగా ద్వంద (ద్వివిధ) జీవితం గడుపవలసివచ్చేది. అయితే నేను కోరే సుఖాలంత చెడ్డవికావు. అయినా నా ఆశయాలు ఉన్నతమైనవి. కనుక వాటినైనా ఇతరులు తెలిసికోగూడదనుకునేవాణ్ణి. ప్రతిమానవుని ప్రకృతిలోను మంచి, చెడు అనేవి రెండూ ఉన్నాయనే సంగతి గ్రహించాను. ఈ రెండూ శరీరంలో కలసేఉంటాయి. మంచి ప్రకృతి, చెడు ప్రకృతి తెచ్చే అవమానాన్ని లెక్కచేయకుండా, మంచి పనులుచేస్తూ ఉంటుంది. ఈ రెండూ ఒకే శరీరంలో కలసి ఉండటం మానవునికి శాపమనే చెప్పాలి. అంచేత నేను ఈరెంటినీ విడదీయాలనుకున్నాను. నా రసాయనశాస్త్ర పరిశోధనలలో ఈరెంటినీ విడదీసే అవకాశం ఉందని గ్రహించాను. మంచి ప్రకృతిని పోగొట్టి చెడు ప్రకృతిని మాత్రమే శరీరంలో ఉంచే గట్టి మందునొక దానిని కనుక్కున్నాను. ఈ విధంగా విడదీయబడినపుడు మంచి ప్రకృతి సాహచర్యాన్ని కోల్పోవటంచేత, చెడు ప్రకృతి ఇంకా అధ్వాన్నంగా తయారవుతుంది.

ఒకనాటి రాత్రి రక్తవర్ణ ద్రావకంతో, ఒక తెల్లటి ఉప్పుకలిపి మరగబెట్టి, చల్లార్చాను. ఆ మందు త్రాగితే నేను చనిపోయే ప్రమాదంగూడా ఉంది. అయినా ధైర్యంతో ఆ మందు త్రాగాను. మరణబాధ ప్రారంభమైంది. జబ్బు స్థితి ఏర్పడింది. అయితే వెంటనే అదిపోయి, మామూలు స్థితికి వచ్చాను. కాని శరీరంలో వింతమార్పు జరిగింది. యువకునిగా, తేలిగ్గా, ఎక్కువ దుష్టునిగా తయారయ్యాను. వింతవింత అనుభవాలుతోచి చేతులొక్కసారి జాపాను. మనిషి చిన్న వాణ్ణయానని గ్రహించాను. అక్కడ అద్దంలేదు. అంచేత ఇంకో గదిలోకి వెళ్లి అద్దం ముందఱ నిలబడ్డాను. మొట్ట మొదటిసారిగా ఎడ్వర్డు హైడ్ రూపాన్ని చూసాను. క్రొత్త శరీరం పూర్వంకంటె చిన్నదిగాను, యౌవనంతో కూడినది గను ఉంది. నా మంచి ప్రకృతి చెడు ప్రకృతిని అదుపులో పెట్టేది. చెడు ప్రకృతికి అంత పని ఉండేదికాదు. అంచేతే ఎడ్వర్డు హైడ్, హెన్రీ జెకిల్ కంటె చిన్నవాడుగను, యువకుడుగను ఉన్నాడనుకున్నాను. జెకిల్ ముఖంలో మంచి ప్రకాశిస్తుంటే, హైడ్ ముఖంలో చెడు తాండవిస్తోంది. ఎడ్వర్డు హైడ్ రూపాన్ని చూచి నేనేమీ భయపడలేదు. ఏమంటే అది నా ప్రకృతిలో ఒక భాగమేగదా. అయితే బయటకు వచ్చినపుడు జనం ఎడ్వర్డు హైడ్‌ను భయంతో చూచేవారు. ఏమంటే అది పూర్తి దుష్టస్వరూపం. తరువాత ఇంకో పనిచేయాలి. ఎడ్వర్డు హైడ్, తిరిగి జెకిల్ అవటం సాధ్యమేనని తెలిసికోవాలి. అంచేత తిరిగి నా గదిలోకి వెళ్లి

మందు, తయారుచేసి పుచ్చుకున్నాను. మళ్ళీ శరీరంలో మార్పు కలగటం, హెన్రీ జెకిల్‌గా అవటం జరిగింది.

నేను మంచి మనస్సుతో ఉన్నప్పుడు ఆమందు తీసి కోటం జరిగియుంటే, దేవతాస్వరూపునిగా తయారయ్యేవాణ్ణి. మందు దానంతటది మంచిదని, చెడ్డదని చెప్పటానికి వీల్లేదు. నేను మందు పుచ్చుకున్నప్పుడు మంచి ప్రకృతి అణగారి నిద్రపోతూండటంచేత, మెళుకువగా ఉన్న చెడు ప్రకృతి వచ్చినఅవకాశాన్ని చేజిక్కించుకుంది. ఫలితం నేను ఎడ్వర్డు హైడ్‌గా తయారవటం.

తరువాత నేను సోహోలో ఒక యింటిని తీసుకొన్నాను. నా నౌకరులకు, ఎడ్వర్డుహైడ్ అనే నా స్నేహితుణ్ణి స్వేచ్ఛగా లోనికిరానిచ్చి, ఇంటిని యిష్టంవచ్చినట్లు ఉపయో గించుకోనీయవలసిందని చెప్పాను. నా ఇంటికి ఎడ్వర్డుహైడ్ గానే చాలాసార్లు వెళ్ళేవాణ్ణి. నా ఆస్తంతా ఎడ్వర్డుహైడ్‌కు చెందాలని ఒక వీలునామాగూడా వ్రాసాను. ఈ విధంగా ఎందుకు వ్రాశానంటే డాక్టర్ జెకిల్‌గా నాకేం హాని జరిగినా, నాడబ్బుకేమీ నష్టం ఉండదు. ఎడ్వర్డుహైడ్‌గా అనేక ఇంద్రియ సుఖాల్ననుభవిస్తూ సిగ్గుచేటైన పనులుగూడా చేసే వాణ్ణి. ఒకనాటి రాత్రి ఒక అమ్మాయిని పడగొట్టి పారిపో బోయాను. కాని నన్ను ఒక మనిషి పట్టుకున్నాడు. అమ్మాయి చుట్టూ జనులు గుమిగూడారు. వారు నన్ను చంపేస్తారను కున్నాను. అయితే వారు నన్ను అపరాధంక్రింద నూరుపౌనులు చెల్లించమన్నారు. లేబరేటరీద్వారంగుండా ఇంట్లోకి వెళ్ళి పది

పౌనులు నాణాలు, 90 పౌనులకు హెన్రీ జెకిల్ సంతకతో ఒక చెక్కు ఇచ్చాను. అప్పటి అనుభవాన్నిబట్టి ఎడ్వర్డుహైడ్ అనేపేరుతోగూడా బ్యాంకులో కాతా ప్రారంభించాను. ఎడ్వర్డుహైడ్ గా అక్షరాలు వెనక్కువంచి దస్తూరీ వ్రాసేవాణ్ణి.

ఒకనాడు నేను ఆలస్యంగా లేచాను. శరీరంలో వింత ప్రవృత్తి తోచింది. చెయ్యి చూసుకున్నాను. పల్చగా, సన్నగా నల్లని పొట్టి వెంట్రుకలతో ఉంది. అది ఎడ్వర్డుహైడ్ చెయ్యి. భయంతో ప్రక్కనుండి క్రిందకు దుమికి అద్దంలో చూచుకున్నాను. హెన్రీ జెకిల్ గా నిద్రపోయాను. ఎడ్వర్డు హైడ్ గా నిద్రనుండి లేచాను! నౌకరు లందరూ మేల్కొన్నారు. మందు ప్రయివేటు గదిలో ఉంది. ఏం చెయ్యాలో తోచలేదు. ఇంతలోకే నా నౌకరులు హైడ్ రాకపోకలను గూర్చి యెరుగుదురన్న విషయం జ్ఞాపకం వచ్చింది. దుస్తులు ధరించి ప్రయివేటు గదిలోకి వెళ్ళాను. మందుపుచ్చుకున్నాను. పది నిమిషాల తరువాత హైడ్నల్లా జెకిల్ నయ్యాను.

ఈ సంఘటన నాకు కనువిప్పు కలిగించింది. ఎడ్వర్డు హైడ్ కు పని ఎక్కువయింది. నేను జాగ్రత్తగా ఉండకపోతే శాశ్వతంగా ఎడ్వర్డుహైడ్నై పోవచ్చును. మొదట్లో ఎడ్వర్డు హైడ్ గా మారటం కష్టమయ్యేది. కాని ఇప్పుడు హైడ్ నుండి జెకిల్ గా మారటం కష్టంగా ఉంది. ఇప్పుడు నేను ఈ రెంటిలో దేన్నో ఒకదాన్ని నిర్ణయించుకోవలసి వచ్చింది. జెకిల్ గానే ఉండటమంటే, ఇంద్రియసుఖాలన్నిటినీ వదలుకోట మన్నమాట. హైడ్ గానే ఉండటమంటే అందటిచే

ద్వేషింపబడి స్నేహితుల్లేకుండా ఉండటమన్న మాట. నేను జెకిల్‌గానే ఉండి, హైడ్‌గా పొందే ఇంద్రియసుఖాల్ని కోల్పోటానికి నిశ్చయించుకున్నాను. రెండు నెలలు జెకిల్‌గా క్రమబద్ధ జీవితం గడిపాను. అయితే తరువాత హైడ్‌గా ఇంద్రియ సుఖాల్ననుభవించాలనే కోరిక మొలకెత్తింది. అంచేత తిరిగి ఒకరాత్రి మందు పుచ్చుకున్నాను.

చెడు ప్రకృతి రెండు నెలల్నుంచీ బంధింపబడియుందేమో, ఒక్కసారి బోనులోంచి వెలువడ్డ సింహంలా అయింది నా పని. నన్ను నేను అదుపులో పెట్టుకోలేక పోయాను. దాని ఫలితము సర్ డేన్వర్సు కేరూ హత్య. భయంతో సోహో లోని యింటికి పరుగెత్తి కాగితాలన్నీ తగులబెట్టేశాను. నా యింటికి తిరిగివచ్చి, తిరిగి జెకిల్‌నై భగవంతుని క్షమాపణను కోరుకొన్నాను.

ఆనాటినుంచీ హంతకునిగా అరెస్టవుతాననే భయంచేత తిరిగి ఎడ్వర్డుహైడ్ అవటానికి ఏమీ ప్రయత్నించలేదు. శాంతిమయ జీవితం గడిపి యితరులకు మేలు చేయటానికి నిశ్చయించుకున్నాను. అయితే ఇంద్రియ సుఖాలపై ఇచ్ఛ చావలేదు. కాని వాటి నిప్పుడు హైడ్‌గా గాక జెకిల్‌గానే అనుభవించటం ప్రారంభించాను.

అది ఒక మనోహరమైన రోజు జనవరిమాసంలో. రీజెంటు పార్కులో ఒక బెంచీమీద కూర్చొని ప్రకృతి సౌందర్యాన్ననుభవిస్తున్నాను. హఠాత్తుగా నాలో ఒక మార్పు గోచరమయింది. కొద్ది నిమిషాలలో నేను పూర్తిగా

ఎడ్వర్డు హైడ్‌గా మారిపోయాను. కొద్ది నిమిషాల క్రితం నేను గౌరవనీయుడైన డాక్టర్ జెకిల్‌ను. ఇప్పుడు హంతకుడుగా పోలీసువారిచే వెదుకబడుచున్న హైడ్‌ను. ఏంచెయ్యాలో నాకేమీ తోచలేదు. నా మందులన్నీ ప్రయివేటు గదిలో ఉన్నాయి. లేబరేటరీ తలుపులు తాళంవేసి ఉన్నాయి. ఎడ్వర్డు హైడ్‌గా నేను నాయింటికి వెళ్ళినా, నానౌకరులేనన్ను పోలీసువారికి పట్టి అప్పగిస్తారు. అప్పుడు డాక్టర్ లేన్యన్ గూర్చి ఆలోచించాను. వెంటనే ఒక హోటలుకు వెళ్ళి, గది తీసికొని జెకిల్ దస్తూరీతోనే లేన్యన్‌కో ఉత్తరం, పూల్‌కో ఉత్తరం వ్రాసాను. ఆరోజంతా చీకటికోసం ఎదురుచూస్తూ భయంతో గదిలో కాలం గడిపాను. అర్ధరాత్రి లేన్యన్ యింటికి వెళ్ళి తిరిగి జెకిల్ నయ్యాను. నా మార్పు లేన్యన్‌కు భయాన్ని కలిగించింది. (ఈ వివరాలన్నీ లేన్యన్ వ్రాసే ఉత్తరంలో ఉంటాయి.)

తరువాత నేను ఇంటికి వెళ్లి నిద్రపోయాను. తెల్లారి లేచేసరికి అతి బలహీనుడుగా ఉన్నాను. నేను మెల్లిగా నడుస్తూండగా తిరిగి ఎడ్వర్డు హైడ్‌నై పోయాను. మళ్లీ జెకిల్ నవటానికి మామూలుగా తీసుకునే మందుకు రెట్టింపు మందు తీసుకోవలసి వచ్చింది. ఇది నాకు చాలా విచారాన్ని కలుగజేసింది. మళ్లీ ఆరు గంటలయేటప్పటికి, ఎడ్వర్డ్ హైడ్‌గా మారితే తిరిగి మందు తీసుకోవలసివచ్చింది. ఆనాటినుంచీ డాక్టర్ జెకిల్‌గా మారటం చాలా కష్టసాధ్యమైన పని అనే విషయాన్ని గుర్తించాను. నేను జెకిల్‌గా నిద్రపోవటం, హైడ్‌గా లేవటం మామూలై పోయింది.

